శ్రీ ర స్తు.

---

ఈ నాటకమును గుఱించి కొందఱు తమతమయభిప్రాయముల దయచేసిరి. వానిలోఁ గొన్నింటి నీ క్రిందఁబొందు పఱుచుచుంటిని.

1. మదరాసు ప్రసిడెన్సీకాలేజీలోఁ దెలుఁగు పండితులును, శ్రీమద్వాల్మీకి రామాయణమంతయుఁ దెనిఁగించి యాంధ్రవాల్మీకి నా ప్రశస్తి వడసినవారును, నగు బ్రహ్మశ్రీ, వావిలికొలను సుబ్బారావు పంతులుగారు క్రింది విధమున వ్రాయుచున్నారు.

శ్రీమద్బులుసు, సీతారామశాస్త్రులవారు రచించిన కృష్ణాకుమారీ నాటకము నంతయుఁ జదివిచూచితిని. కథ ప్రసిద్ధ చరిత్ర మగుటచే నే జెప్పవలసినదేమియు లేదు. కవిత్వము మిక్కిలి సరసముగను మనో హరముగను నున్నదనుట నిర్వివాదాంశము. వర్ణనలు సముచితమ గను హృదయంగమములుగను నున్నవి. రసము పోషింపఁబడి యున్నది యింతయేల యిదియుత్తమ నాటకములలోఁ జేర్చ... సని ... భాషాజ్ఞానములేక కుక్షింభరత్వకారణముచే మా... సమూ నాశనముచేయ నుద్దేశించి పాటుపడుచున్న భాషాదూషకులచే ... డలు పడుచున్నను నిక్కమైనభాషాభిమానముగల యిట్టి పండితు పురోభాగుల దూషణముల సరకుగొనక స్వాభిమానము నిట్టికా రూపముగా లోకమున వెల్లడింపఁజేయుటచే భాషావిద్వేషులు మ యాంధ్రభాషకుఁ గల్పింప నుద్దేశించిన స్థితి యింకను రాలేదని న సంతసించుచు నిట్టివారికి లోకోపకృతికి భాషోపకృతికినిగాఁ బెక్కుగ్ర థములు రచించుశక్తితో నాయువు భగవంతుఁ డొసంగుఁ గాక య భగవంతుని వేఁడుచున్నాఁడ.

ఇట్లు,

ఓం

శ్రీగురుభ్యో నమః.

# కృష్ణాకుమారీనాటకము.

శ్రీమద్బొబ్బిలి పురవాసియగు

నష్టావధాని, బులుసు - సీతారామశాస్త్రిచే

విరచితము.





చెన్నపురి:

వావిళ్ల-రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

బ్రకటితము.

Price As. 0 10. 1913. 




చదువరులారా! ఈకృష్ణాకుమారినాటకము (James Todd) దొరగారిచే నాంగ్లేయభాషలో వ్రాయఁబడిన రాజస్థానకథావళిలోని చరిత్రము నాధారముగాఁ జేసికొని వ్రాయఁబడినది. ఇందలి కథానాయికయగు కృష్ణాకుమారి పందొమ్మిదవశతాబ్ది పూర్వార్థములో మీవారుదేశమునకు రాణా (రాజు) యగుభీమసింగుని కుమారిత. ఈమె యుత్తరహిందూస్థానములోని రాజపుత్రికులమునకు వన్నె దెచ్చిన "అహల్యాబాయి, తారాబాయి, లక్ష్మీబాయి" మున్నగువారిలో మిన్నయనుట కావంతయయినను సందియంపడ నవసర ముండఁబోదు.

### చరిత్రలోనికథాసంగ్రహము.

పందొమ్మిదవశతాబ్ధియారంభములో ఢిల్లీచక్రవర్తియగు ఔరంగజేబు మృతి నొందుటయు; నాయనకుమాళ్ళు:—

శా. హుక్కాత్రాగుచు రాత్రియుంబవలు రాజ్యోద్యోగముల్ మానిక్కై
వెక్కింపందగువస్తువుల్ మెసవుచున్ హేలావినోదమ్ముగా
నక్కల్ సక్కనితక్కులాఁడులకునై యర్పించి తా మెవ్వరో
లెక్కింపన్ మతిలేనియావనవిభుల్ సేవింపఁగా యోగ్యులే!"

(పండితరాజనాటకము)

అనుపద్యమునకు లక్ష్యముగా మద్యపానాదివ్యసనపరంపరకు లోనయి రాజ్యపాలనముసంగతియే మఱచిరి. వారియశక్తతచే రాజ్యమంతయు నంతదశకు వచ్చినది. అక్కాలమున స్వదేశరాజుల కైకమత్యములేమింజేసి యన్యోన్యమును బోరాటములు సంభవించుచు, నవి దేశక్షోభమునకుఁ గారణమయినవి. అట్టిసమయమున మహా

రాష్ట్రులు ప్రబలి వీలయినంతవఱకు దేశముల నాక్రమింపసాగిరి. అప్పుడు మనకథానాయికకు జనకుఁడగు రాణా భీమసింగు రాజపుత్రస్థానములోఁ జేరినమీవారు రాజ్యము నేలుచుండెను. ఆయన బాల్యమునుండియు దుర్వ్యసనపరాయణుఁడు. భోగలంపటుఁడు. అసమర్థులలో మొదటివాఁడు. కావుననే రాజ్యపరిపాలనకుఁ దగినశక్తి లేని తనకుమారునకు రాజ్య మీయక రాణాతల్లి తానే యేలుచుఁ దనమంత్రికుటుంబముల కన్యోన్యమును గయ్యము గలిగించి తన్మూలమున దేశమునకు మఱింతసంక్షోభమును గలిగించినది. అమాయికుఁ డగుభీమసింగు తుదకెట్లనో రాజ్యమునుండి ప్రకృతసంక్షోభమును నివారింపఁజాలక తుట్టతుదకు మహారాష్ట్రుల సాయముగోరి తన్మూలమున రాజ్యమునంతయు దీనావస్థపాలు చేసెను.

ఈవిధముగా దేశము మహారాష్ట్రు లాక్రమించుకొనియుండఁగా నంతట హోల్కారు, సింధ్యాయుఁ బోరాడి జయ మలవడు నతఁడు మీవారురాజ్యమును స్వతంత్రరాజ్యముగా నెంచి కప్పముఁబుచ్చుకొనుచుండెను. ఒకప్పుడు రాజ్యము హోల్కారునకును, మఱొకప్పుడు సింధ్యాకును నధీనము కావలసివచ్చుచుండెను. ఇట్లగుటచే వీరిరువురకును గట్టుకప్పములచేఁ గోశాగారము శుద్ధశూన్యదశకువచ్చినది. పయిని రాజ్యము ఋణగ్రస్తమాయెను. తుట్టతుదకు వీరిరువురిలో సింధ్యా విజయలక్ష్మిని గొనుటచే మీవారు రాజ్య మాతనియధీనములోనే యుండెను.

ఇది యిట్లుండఁగా మహారాష్ట్రప్రభువగు దౌలతరావు సింధ్యా మనకథానాయిక యగు కృష్ణాకుమారియొక్క సౌందర్యాదులను విని తన కాసుందరిని పెండ్లిచేసికొనుట కిమ్మని కోరి యామె తండ్రి యగుభీమసింగుచే నిరాకరింపఁబడి యప్పుడు జాడ్పూరు రాజధానిగాఁగలమారువారుదేశమునకు రాణా యగుమానసింగుతో నెయ్యమున కియ్యకొని, యతనియభీష్టమును నెఱవేర్పఁదలంచి

" నాకియ్యక పోయినను మానసింగునకైనను కృష్ణాకుమారి నిచ్చి పెండ్లి చేయవలసిన"దని మరల నామెతండ్రిని గోరి యంగీకరింపఁబడిన నిరాకృతుఁడై, యంతట జయపూరు రాజధానిగాఁ గలయంబరు దేశమున కధిపతి యగు జగత్సింగు రాణాకుఁ గృష్ణనిచ్చి వివాహము సేయుటకు వాగ్దాన మగుటయు విని యమితముగఁ గోపించెను.

అట్లు కోపపిశాచికావిష్టహృదయుఁడయి మిత్త్రులతోడను, సైన్యముతోడను వచ్చి యుదయపురపుఁగోటను ముట్టడివైచి ఘోరంగులఁ బ్రేలింప మొదలిడెను.

అంత భీరు వగు భీమసింగు మఱింత భయావిష్టహృదయుఁడయి కింకర్తవ్యతావిమూఢుఁడై తాను జేసిన వాగ్దానమును దప్పి రాజ్యము కాపాడుకొనుటకై మానసింగునకే తన బాలిక నియ్య నియ్యకొనెను.

ఆసంగతియంతయు విని కలుషితస్వాంతుఁడై జగత్సింగు మానసింగున కొక దాయాదుఁ డుంటను దెలిసికొని వానిని బ్రోత్సాహపఱిచెను. అట్లు పురికొలుపఁబడిన దాయాదునికి మానసింగు యొక్క సైన్యములోనుండి సగము సైన్యము సాయపడినది. అంతట జగత్సింగుగూడఁ దన సైన్యముతోఁ దోడువచ్చి మానసింగుపై దాడి వెడలించెను. అంతట నుభయులకును ఘోరయుద్ధము జరిగినది. ఆయుద్ధములో మానసింగు సైన్యసమేతముగా నోటుచెంది పాఱి యాయవమానమును సహింపఁజాలక, పొడిచికొని చచ్చుటకు సన్నద్ధుఁడయ్యు; నతనిమిత్త్రునిచే నోదార్పఁబడి మెట్టకేలకుఁ గోటకుఁ జేరి మరలఁ దన సైన్యమును బలపఱుచుకొన మొదలిడెను.

అంతట నుపేక్షావశంవదుఁడై యున్న జగత్సింగు జాగరూకుఁడై మానసింగుకోటను ముట్టడింప నారంభించెను. కాని తన సైన్యమున కాహారోపయోగ మగుపదార్థములు చాలమిచేతను,

మఱికొన్ని కారణములచేతను మానసింగునిదాయాదునకును దన కును నంతఃకలహములు పుట్టఁగా; నాదాయాదునిసైన్యము జగత్సిం గుసైన్యమును హైన్యము నొందించినది.

అపుడు జగత్సింగు చేయునదిలేక దాయాదునిసేనాధిపతు లకు వలసినన్ని లంచము లిచ్చికొని తుదకుఁ దానెక్కివచ్చిన పట్టపు టేనుఁగు మొదలగుయుద్ధోపకరణములను గూడ రణభూమిలో విడి చి ప్రాణములు పిడికిడిలో నుంచికొని మెట్లో కోటకుఁ జేరెను.

అట్టిసమయమున మానసింగు కొంచెము నెమ్మదిపడి మరల సైన్యమును గూర్చికొని సింధ్యాసేనాధిపతి యగునమీరుఖానుని వలనఁ గొన్నికపటోపాయములు పన్నించి తనదాయాదుని జంపించి నిష్కంటకముగా రాజ్య మేలుకొనుచు, నీయమీరుఖానునే కృష్ణా కుమారీపరిణయమునకు రాయబారినిగా నామె తండ్రియగు భీమ సింగునొద్దకుఁ బంపెను.

అట్లు రాయబార మంపఁబడిన ఖానుఁ డుదయపురము ప్రవే శించి"తనప్రభు వగుసింధ్యాకుఁ గుమారి నీయకపోయెనే"యనుకోప మున నామెను జంపింప నెంచి, భీమసింగునకు నమ్మికమంత్రి యగు నజితసింగునకు లంచ మిచ్చి యతనిని బ్రోత్సాహపఱిచెను.

అంత భీమసింగు కుటిలుఁ డగుమంత్రియొక్క యాలోచ నము విని వానియనుమతి నంగీకరించి కూఁతుం జంపుట కెన్నేని ప్రయత్నము లాచరించెను. అట్టియెడఁ గృష్ణాకుమారి యించుకేని యుఁ జలింపక తనదేశమునకు రాజ్యమునకును దటస్థించిన దుస్థితి కెంతయు వగచి తదుద్ధరణతత్పరయై తనమరణమునకై వగచుతల్లి దండ్రుల కనేకవిధములుగ నీతులు గఱపి వారినోదార్చి తనధైర్య మును విడవక ప్రజలందఱును సుఖముగ నుందురుగాక యని వా రిచ్చినవిషముం గ్రోలి రాజకులమున కేవిధమయిన యాటంకమును

లేకుండునటులు చేసి, నశ్వర మగుభౌతికశరీరమును విడిచి శాశ్వత మగుకీర్తిశరీరమును గైకొన్న దని చదువరులహృదయములు నీరగు లాగున నీచరిత్రములో ముగింపఁబడినది.

అట్టి వీరవనితచరిత్ర ప్రతిమనుజునకును బఠింపఁదగినది యను నభిప్రాయముచే నాటకరూపముగా వ్రాయఁబూనిననేను కథానాయిక మృతినొందె నని వ్రాయుట యమంగళముగా నెంచి యట్లువ్రాయక, యామె సాహసాదిధైర్యగుణంబుల కొక్కింతయు లోటురాకుండునటులను, మఱియు నామె విషముద్రావి మృతినొందె నని వ్రాసిన చరిత్రలేఖకులమాట యసత్యముగాకుండునటులను, దోషరహితమగునట్లు, మనకథానాయికతండ్రి యగుభీమసింగుని మేనల్లుఁడే "యామె విషముద్రావి మృతిం జెందె"నని ప్రతీతి వ్యాపింపఁజేసి తాను బెండ్లియాడినట్లును మార్చి చదువరులహృదయముల కెంతయు సంతతమగు నని వ్రాసితిని.

ఈనాటకమునం దచ్చటచ్చటను బాత్రోచితమగు భాష వాడంబడినది. అదియుఁ జదువరులహృదయముల కానందము గల్గించు నని నమ్ముచున్నాఁడను. నాటకోచితముగఁ గొన్ని బాత్రములును నామములును గల్పితము లని యెఱుఁగందగును.

ఈనాటకమునఁ బ్రథమాంకములో నాకాలపుదేశస్థితియు, భీమసింగుని యమాయికతయు, నతనిమేనల్లుని ధైర్యసాహసాదులు, గురుభక్తియు, సౌమ్యసింగునిసౌమ్యతయుఁ దెలుపఁబడినవి.

రెండవయంకమున సింధియాప్రాబల్యము, జాడ్పూరురాణా యగుమానసింగునకు సింధియాకును గలిగిన సఖ్యాదులు, కృష్ణాకుమారిచిత్రపటమును జూచి సింధ్యావలచుటయు మొదలగునవి యభివర్ణింపఁబడినవి.

మూఁడవయంకములో భీమసింగువిలాపము, సింధ్యాకును భీమసింగునకును జరిగిన యుత్తరప్రత్యుత్తరములును, యథోచితముగ వర్ణింపఁబడినవి.

నాలవయంకమున లంచముగొని భీమసింగునిమంత్రి కృష్ణాకుమారిని జంపి రాజ్యము నుద్ధరించుకొనుటయె ముఖ్యకర్తవ్య మని భీమసింగునకు హితము నుపదేశించి యెట్లో యొప్పించుట. మహా దుఃఖము !

పంచమాంకమునఁ గృష్ణాకుమారిం జంపుటకై పోయిన భైరవసింగు తనసవతి యన్నయగుభీమసింగునికూఁతు రగుకృష్ణాకుమారియొక్క గుణసంపత్తికెంతయు నలరి తావచ్చిన పని సేయ నోపక పరవశుఁడై కత్తిఁగూడ నచటనే పాఱవైచి సాష్టాంగ మర్పించి బైటికిఁ బోవుటయుఁ, గృష్ణాకుమారికిని జెలులకును భైరవసింగున కును జరిగినసంభాషణాదికము చదువరులకు హృదయంగమ మగు నట్లు వ్రాయఁబడినది.

షష్ఠాంకమున విషమును ద్రావించి కృష్ణాకుమారిని విధి లేక చంపించుటకు సిద్ధపడిన తలిదండ్రులకును, గృష్ణకును, యామెచెలి కత్తెలకును జరిగిన యన్యోన్యప్రీతిసూచక మయినసంభాషణయు, విషాదోద్రేక మగుసంభాషణయు, మంత్రియొక్క కాపట్యము, ప్రభాసింగునిబలగర్వము, కృష్ణాకుమారి "విషముద్రావి మృతి నొందిన" దని ప్రతీతిని బుట్టించి యామెమేనత్తకొడుకుఁ దాను దీసి కొనిపోవుట, తాను జేసినఘోరకృత్యమునకు వెంటనే తగినఫల మును మంత్రి పొందుట మొదలగుసంశములు యథోచితముగా నుదాహృతము లయినవి.

సప్తమాంకమునఁ గృష్ణాకుమారివివాహము, ప్రభాసింగున కును, గృష్ణాకుమారికిని గలయన్యోన్యానురాగము మొదలగు వానితో నాతిశృంగారముగా నాటకము ముగింపఁబడినది.

## విన్నపము:—

నా కిదియే ప్రథమప్రయత్న మగుటచే నిందెన్నేని లోపము లుండకపోవు. అయినను బ్రకృతకాలపువారు వ్రాయునాటకములకువలెనే దీనికిని గథానాయిక యొక్క గుణాదులచే నయినను గౌరవము గలుగకపోదని నమ్ముచున్నాఁడను.

ఇట్టి నానాటకమును సావధానముగా విని నూఁటపదియాఱురూప్యములుఁ గూడఁ బారితోషికముగా దయచేయుటయేకాక యచిరకాలముననే ముద్రింపించి, నా కుచితముగ దయచేసిన బ్రహ్మశ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

కాని మహాశయులారా!

సీ. బొబ్బిలినుండి గొ♦బ్బునఁ జెన్నపురికి రప్పించి నాఁ డలర మె♦ప్పించినాఁడు
రప్పించియుం దన♦గొప్పతనం జెల్లఁ, జూపినాఁ డనురక్తి ♦ సూపినాఁడు
మామకకృష్ణాఖ్య♦మారిని ముద్రించి, యిచ్చినాఁ డుచితార్థ ♦ మిచ్చినాఁడు
అలహరిశ్చంద్రు నా♦యావేదముల మించి, యాడినాఁ డింక మా♦రాడినాఁడు
గీ. కాఁడు; వావిళ్ల సత్కుల♦కలశవార్ధి, రాశిరాకాసుధాకర♦రమ్యమూర్తి
వేంకటేశ్వరశాస్త్రి, వి♦వేకధాత్రి, చెలఁగుచుండుతఁ బుడమి జే♦జేలువొగడ.

మఱియు నీనాటకము ముద్రించునపుడు నా కనేకవిధములుగాఁ దోడ్పడినవారును, కలకత్తారాజకీయసంస్కృతవిద్యాలయాధ్యక్షులచేఁ గావ్యతీర్థ - పురాణతీర్థాదిబిరుదముల నందినవారును నగు బ్రహ్మశ్రీ శతావధాని పురాణం-సూర్యనారాయణ తీర్థులవారికి నా కృతజ్ఞతాసూచకవందనము లర్పించుచు వారు నా నాటకమును గూర్చి యిచ్చిన యభిప్రాయమును క్రిందం బొందుపఱిచి యింతతో విరమించుచున్నాఁడను.

ఇట్లు
గ్రంథకర్త,
బులుసు-సీతారామశాస్త్రి,
బొబ్బిలి.

2-7-13
మద్రాసు

బ్రహ్మశ్రీ బులుసు - సీతారామశాస్త్రి కవిగారిసన్నిధికి:—

అయ్యా! మీచే రచింపఁబడిన "కృష్ణాకుమారి" నాటకమును జదివితిని. మీరు పీఠికలో వ్రాసినప్రకారముగా దేశచరిత్రను దెలుపుకథ యగుటం జేసి పాఠకులకు హృదయరంజకముగా నుండు ననుటకు సందియము లేదు. మఱియుఁ జరిత్రలోని యమంగళసూచక మగుకథను మీరు చక్కఁగా మార్చితిరి. మీరు పీఠికలో "నాకిదియే ప్రథమప్రయత్నము" అని వ్రాసితిరి. అది యెంతవఱకు సత్యమో? మీహృదయమునకే తెలియవలయును, కాని,మీ రీనాటకమునం దుపయోగించిన కవితాశైలినిబట్టి మీకిది ప్రథమప్రయత్నమని నేను నమ్మఁజాలను. అట్లైనిని నానాఁటికి మీకవితాసుందరి మఱింత సర్వాంగసుందరియై యందఱ హృదయముల నింక నలరింపఁగలదు.

ఇట్లు విధేయుఁడు,
పురాణం - సూర్యనారాయణతీర్థులు.

---

☞ ఈ నాటకము వలయువారు బ్రహ్మశ్రీ వావిళ్ల-రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారికి వ్రాసియైనను, లేక తెన్నేటి సూర్యనారాయణపాతులు, హైస్కూలు రైటర్, బొబ్బిలి, విశాఖపట్నంజిల్లా, అని వ్రాసియైనను బడయఁగలరు.

# ఈనాటకమునందలిపాత్రలు.

---

## ప్రథమాంకము.

1. భీమసింగు—కృష్ణాకుమారితండ్రి
2. సౌమ్యసింగు——భీమసింగుబావ
3. ప్రతీహారి—ద్వారపాలకుఁడు.
4. ప్రభాసింగు—రాజుమేనల్లుఁడు.

(సరదార్లు దొంగలు మొదలగువారు)

## ద్వితీయాంకము.

1. సింధ్యా—మహారాష్ట్రప్రభువు.
2. మంత్రి.
3. ప్రతీహారి.
4. కలాచలభట్టు—జాడ్యాపురపండితుఁడు
5. దీర్ఘజంఘ—ఉదయపురభటుఁడు.

## తృతీయాంకము.

1. భీమసింగు.
2. అజితసింగు—మంత్రి.
3. సౌమ్యసింగు.
4. భటుఁడు—సింధ్యాప్రేషితుఁడు.
5. ప్రతీహారి.
6. భూసుఁడు—జాడ్యాపురాయబారి.

## చతుర్థాంకము.

1. పేరన్న }
2. జాంబన్నావధాని } మహారాష్ట్ర దేశీయులు

3. భీమసింగు.
4. అజితసింగు.

## పంచమాంకము.

1. భైరవసింగు—రాజుసవతితమ్ముఁడు.
2. కృష్ణాకుమారి—కథానాయిక.
3. భాసురాంగి }
4. కనకాంగి } చెలికత్తెలు.

## షష్ఠాంకము.

1. కృష్ణాకుమారి.
2. భాసురాంగి.
3. కనకాంగి.
4. ప్రభాదేవి—కృష్ణతల్లి.
5. భీమసింగు.
6. అజితసింగు.
7. కుటిలక—అంతఃపురపరిచారిక.
8. ప్రభాసింగు.
9. సౌమ్యసింగు.

## సప్తమాంకము.

1. కృష్ణాకుమారి.
2 భాసురాంగి.
3. కనకాంగి.
5. ప్రభాసింగు.



మ. స్థిరమై సుస్థిరమై సమస్తనిగమాంతశ్చింత్యంబు నై చిత్సుఖా
కరమై సంకరమై గుణత్రయగతాకారోచితోద్యోగమై
చరమై గోచరమై బుధావళిశుకీసంస్తూయమానంబు నై
పరమై యొప్పి వెలుంగు నాహరిహరబ్రహ్మంబు నేఁ గొల్చెదన్





ఓం.

శ్రీగురుభ్యో నమః.

# కృష్ణాకుమారీనాటకము.

## నాంది.

శా. శ్రీకృష్ణుండు సుధాకరాయతముఖీ శ్రీ చిత్తానుసారంబుగా
నాకాలంబున జూద మాడుతఱిఁ గృష్ణా! కావవే? ప్రోవవే?
యాకంసాంతక! యంచుఁగూయిడఁగనో హా! యక్షయంబాచుఁ
డా, నాకాతీతఫలం బొసంగునలకృష్ణాపాలుఁ డేలుఁ మిమున్.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి, తెరవంక జూచి)

సూ—అలంకరించుకొనుట యైనచో నటి! ఇట కొకసారి రమ్మ.

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్త్రా! నమస్కారము.—

సూ—సౌభాగ్యవతీ భవ.

నటి—నాథా! నాచేయుపను లుండేనేని నాజ్ఞ యొసంగుదరుగాక.

సూ—ఆర్యా! సకలకలాకోవిదులును, దిగంతవిశ్రాంతయశస్కులును, అశేషభాషా భూషితహృదయులును, నవరసభరితాంతరంగులును, నాగరికాగ్రేసరులును, నగునీసభాజను లయత్నముగ లభ్యు లయిరి గావున; వీరలకడ నెద్దియేని రూపకం బొకండు ప్రదర్శింప నుత్సాహినై పిలిచినాఁడను. కావున వీరల హృదయముల రజింప నెట్లు తోఁడ్పడెదో గదా!

నటి—ఆర్యపుత్త్రా! మింటికి నిచ్చెన దార్చులాగున మీ కేల యీపిచ్చితనము? ఈ బుధజనాగ్రగణ్యులహృదయము లెచ్చట? మనము రంజింపఁజేయు టెచ్చట? అట్టిరూపకముగూడ నున్నట్లు గాన్పింపదే?

సూ—అయ్యో! వెంగలీ! జగజ్జేగీయమానప్రతాపులై, బ్రహ్మాండకటాహాతిక్రాంత సాహసయశస్కులై, మానాభిమానములవిషయమై యొరులు దమ్మ భ్రాంతి

గఁ జెప్పుకొనులాగునఁ బెక్కుసంగరములఁ బగఱమద మణంచి, ప్రజాపాల నైకధురీణులై జగంబంతయు యశస్సాంద్రంబుగఁ జేసి, యాయున్నైకజీవను లగుటను దుచ్ఛకళేబరములపై నాసలం గోసి, కోటిజన్మములకైన నార్జింప నలవి కానియశోధను లగుటచే వీరస్వర్గములఁ జూఱఁగొని, కీర్తిశేషులై యలరు నాయుదయపురరాజుల నెఱుఁగకుంటివా?

నటి—అట్టిజగద్విఖ్యాతుల నెఱుఁగనివార లుందురా? ఔ; నెఱుఁగుదు; నైనను?

సూ—అట్టికులమునకు వన్నె దెచ్చినకన్నె కృష్ణాకుమారి. తత్కులాలంకారభూత యైనయామెసాహసధైర్యాదు లనుపమేయము లగుటయు నెవ్వరెఱుంగనివి? ఆనాటక మాడిన నేరిమసంబుల కానందము గాకుండు?

న—అవును; బాగుగనే యున్నది; గాని యానాటక మాడ మనశక్తిఁ జూచికొన వలదా?

సూ—ఆర్యా! అట్టివీరవనితాగ్రణియొక్క నాటక మాడమనము; నదివ్రాయు నా కవియు "జనానందము గాకుండునా" యని జంక నేలా?

గీ. శారదామలచంద్రికాచంద్రుకతన
యామినియుఁ, గుముదినియుఁ జున్నతిశయిల్లుఁ
గాని, భూమిని నాపిశాకాంతునకును
గాంతి సివి, చేయు ననుమాట కలదె చెపుమ?

ఆరీతి నాయానవతీమణియొక్క చరితమే సభానురంజకమును, మనప్రయోగవిజ్ఞానవిజ్ఞాపకమును, కవి చాతుర్యాతిశయవిస్తారయిత్రకమునుగూడ నయ్యెడిని; సంకోచింప నేలా?

న—ఆర్యపుత్రా! అటులే; కాని నా కేమియు సెల వొసంగ రేలా?

సూ—సుందరీ! సభాసదుల నానందపఱుచుటకంటె సెలవున కేమున్నది?

న—అట్లైన నెద్దానిఁగుఱించి గానము సేయుదు?

సూ—అచిరప్రవృత్తమై సకలజనానందకరమై యలరువసంతముకన్న నేమున్నది?

న—చిత్తమటులే. (అని గానము సేయును.)

కవిరాజవిరాజితము.—

తఱచగుపూవుల తావులు గల్గిలతావలయమ్ము సదావృతభం
భరనినదమ్ము లపారము కాఁగ సపాకమహీరుహభాసురప

ఝిరుతము లొప్పఁగఁ గీర్ణమరాళసఖీవలయమ్ము లొగిం గలుగన్
సరసరసాలవిశాలకిసాలరసాదరకోకిల సంకులమై.

మత్తకోకిల. పల్లవాంగుళులం జెలింపుచుఁ బాదపద్మము లూఁపుచున్
మల్లికారదనాభదీపితమందహాసము లొల్క సం
ఫుల్లపుష్పవిభూషణాళివిభూషితుం డయి వింతగాఁ
జల్లగాలులయూపుఁ దాల్చి వసంతుఁ డంతట గంతెసెన్.

సూ—సెబాస్! చెలీ! నీగానప్రభావమున సభాసదులు బొమ్మలవలె నిశ్చేష్టులైరి; గావున మనము ప్రదర్శింపఁబోవునాటక మేదియో మొదట నొడివి కృతయత్నురాలవు కమ్ము.

న—"ఆశ్చర్యచైత్యాలంకారిణి యగుకృష్ణానుమారచరిత మాడుద"మని మొదటనే నుడివియుంటిరే యిట్లనెద రేలా?

సూ—వా! చెలీ! బాగుగ జ్ఞప్తి కొల్పితివి; నీగానమే కదా నన్నుఁగూడ నిట్లు విస్మృతునిగఁ జేసినది?

న—కాని; నాథా! ఈకృతికర్త యెవఁడై యుండునో తెలిసినదికాదు.

సూ—అయ్యో! ఆయన నీ కెఱుకపడలేదా? వినుము వినఁదగినదే యడిగితివి.

ఉ. ఎవ్వరు యోగజాలము లనేకము లీభువిలోన నింపిరో
యెవ్వరు వేదబోద్ధ లయి యేపున గాంచె విరించిరీతి, నిం
కెవ్వరు కర్మరాశి వెలయించిరో శాస్త్రముఁ జూపి, జన్న మిం
కెవ్వరు లేక చేయుటకు నెవ్వరుఁ గాలరో; యాకులీనుఁడే.

న—ఆర్యపుత్రా! అట్టిపవిత్రమగువంశ మెయ్యదియై యుండనోపు? వినఁ గుతూహలము హెచ్చగుచున్నయది.

సూ—అట్టిలోకైకవిఖ్యాతి గలకులము 'బులుసు'కుల, మని చెప్పనేలా? ఈయనపేరు సీతారామకవి యనియెదరు. మఱియు నిక్కపుని మిక్కిలి గారవించి, యీనాటకమును ముద్రించినమహనీయుఁడైన నెఱుఁగుదువా!

న—ఎవఁడా మహితగుణసాంద్రుఁడు? నే వినలేదే?

సూ—ఆలైన వినుము.

సీ. భామాసతికిఁ బెంపు । పరఁగించె నెవ్వాఁడు
ధనముచే గ్రంథశో । ధనముచేతఁ
జిరకీర్తికామినిం । జేపట్టె నెవ్వాఁడు
వరతచే సత్సుధీ । వరతచేతఁ
బటుదానధీమదా । ర్భటిఁ జెందె నెవ్వాఁడు
తెంపుచేతను దెగు । దెంపుచేత
సకలరాణ్మండలీ । సమ్మాన్యుఁ డెవ్వాఁడు
కలితసుధీకలా । కలదచేత

గీ. వాఁడు వావిళ్లలసదన్వ । వాయతోయ
నిధిసుధాకరుఁ డాశాంత । సితకీర్తి
విద్రుమోష్ఠీమనోధీశ । వేంకటేశ్వ
రాభిధుం డెన్న సాధార । ణాభిధుండె ?

న—ఆర్యపుత్రా ! ఈమహనీయుఁడు రాజరాజ్యాంగాదిచిహ్నములు బిరుదములు మున్నగునవి లేకయే యెంతకొనియాడఁబడుచున్నాఁడు ?.

సూ—ప్రేయసీ !

గీ. అగసముత్తుంగశృంగసిం । హాసనంబు
నందు నిండోలగం బుండు । నంత, నింక
భీమసింగంబు నాఁ బేరు । పెట్టుకొనినఁ
దాదృశుం డెట్లు ? చకితమృ । గీదృగాక్ష్య !

మన కితఁడవేలా ? అదె యుదపురాధీశ్వరుఁ డగుభీమసింగు నిండోలగం బుండి, భటుని బిలువ నటు మోము సారించుచున్నవాఁడు. కావున మన మిఁకఁ బోవుదము రమ్ము.

ఇరువురును నిష్క్రమింతురు.

ఇది ప్రస్తావన.

శ్రీ ర స్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## ప్ర థ మా ం క ము.

---

——రంగము. ఉదయపురములో దర్బారు.——

[రాణాభీమసింగు ప్రవేశించును.]

భీ—ఎవఁడురా! అచ్చట.

(అంతఁ బ్రతీహారి ప్రవేశించి) మహాప్రభూ! ఏమి సెలవు?

భీ—మాబావ యగుసౌమ్యసింగును దీసికొనిరమ్ము.

ప్ర—చిత్తము; దేవా! (అని వెడలి దృష్టి నిగుడించి) అదిగో నాయన యిటకే వచ్చుచున్నాఁడు; పాప! మీాయనయు, నేనును, గాలము గడపినవారలము గావున; నే నింటికడను, ఈయన రాజుకడను, లేనిపోని గాథలన్నియుఁ జెప్పి వాపోయుచుందుము. అవియన్నియుఁ జెవిటివానిముందు శంఖములవలెఁ గాక; నిసర్గశౌర్యప్రకర్ష విహీనులకును, నిరస్తసుగుణస్వభావులకును, నెందు నైనఁ దెలియ నగునా? (స్మృతి నభినయించి) ఆఁ! మొన్నటిసంగతి యీా మహానీయున కెఱుకపఱతుఁగాక. అని దరి చేరి.

అయ్యా! నమస్కారము.

(అంత సౌమ్యసింగు ప్రవేశించి) ఇదిగో! లక్ష్మోజి! ప్రభు వేమైనఁ జెప్పి పంచె నా యేమి? ఏమి చేయుచున్నారు?

ప్ర—అయ్యా! ఇప్పుడే భోజనము చేసి కూరుచుండి యున్నారు; ఇంక మీారాకకై వేఁచి యున్నారు. కాని బాబూ! మహారాష్ట్రులు దుర్మార్గులై పెచ్చురేఁగుట మీా కెఱిఁగినదే కదా!

సౌ—అయ్యో! ఆదుర్మార్గులు పొగ రెక్కుట లెవ్వరెఱుంగనివి?

ప్ర—అయ్యా! నిన్నటిరేయి మాయింటిపొరుగున నున్నవర్తకునియింటికి నేఁబది మందిమహారాష్ట్రాధములు కరములఁ గరవాలమ్ములఁ బట్టి, యమదూతలవలె ఘోరాకారులై దోఁపిడికై వచ్చిరి. మ్లేచ్ఛాధములుగూడ నీవిధమున నే ద్రిమ్మరుచుండిరిసుఁడీ!

సౌ—ఈసంగతికూడ జనసామాన్యముగ నేయున్నది. పైసంగతి నేనికడ నే నడుగువాఁడ; గావునఁ బోదము రమ్ము. (ఇరువురును రాజుకడకుఁ బోవుదురు.)

భీ—(సౌమ్యసింగునుంజూచి) బావా! ఆయాసన మలంకరింపుఁడు; ఇంతజాగు చేసితి రేలా?

సౌ—(ఆసనముపైఁ గూర్చుండి తనలో) ఈరాజున కేమిచేతకా కున్నను; గూర్చుండు మనుట,తినుమనుటమాత్రము తెలియంబడె (ప్రకాశముగా) బావా! రాజ్య మెటఁజూచినను మహాసంక్షోభముతోఁ గూడుకొని యున్నది, ఆస్థితి వర్ణింప నా కింతయు శక్యంబు కాదు.

భీ—బావా! ఉపద్రవము లెవ్వియేనిఁ బాటిల్లెనా యేమి?

సౌ—క్రొత్తగా జరిగిన వేవియు లేవు, అయినను వానిలో నిది క్రొత్త; అనఁగా వానియొక్క పరిణామరూపమే.

భీ—బావా! ఏమియో కదా! విన మనము తత్తరింపుచున్నది.

సౌ—"ఏమియో,, యన నేల? ఆమహారాష్ట్రీనములు, మ్లేచ్ఛులుఁగూడ రేయింబవల్లు దేశములం బరిభ్రమింపుచు, నూళ్లను, బల్లెలను, గొల్ల వెట్టుచుఁ జిత్రవధలు గావింపుచుండిరి.

భీ—మన కెవ్వియు సంప్రాప్తములు కాలేదుకదా?

సౌ—ఈచెప్పిన వన్నియు మనకే, మనపట్టనముననే.

భీ—ఏమాయుపద్రవము?

సౌ—ఓయీ! లక్ష్మోజీ! మొన్నటిరేయి నాదోఁపిడికాండ్రు వైశ్యోత్తమునియిలు సొచ్చిన పై వృత్తాంతము నీ కెఱుక వడెనేనిఁ జెప్పుము.

ప్ర—బాబూ! దురాత్ము లట్లా వైశ్యునియిలు సొచ్చి, యాదంపతులను లేపి, యెలుఁగెత్తినఁ గుఠారంబులఁ గంఠనిలుంఠనము సేయువారల మని యదల్చి, నీయాస్తి సూపెదవా? నిర్మూలింతుమా? యని యడిగిరి.

సౌ—ఔను; ద్రవ్యప్రధానుల కాతనితో నిమిత్తమే ముండు? ఇట్లన నాపిటికిబం శేమి చేసినాఁడు?

ప్ర—"నేఁ గేకలువేయ, నాయాస్తి నంతయుఁ గొనుండు చంపకుఁడు" అని బీగములు పాఱవైచినాఁడు.

సౌ—ఆహా! కాఁపాడు వాఁడు లేకయే కదా! ప్రజలు కలుబాముల కాస్పద మగు మండిరి? పిమ్మట?

ప్ర—అట నాముచ్చులు బంగారు, వెండి, నాణెము లాదిగాఁ గలసర్వస్వ మపహరించి, "ప్రియనే ప్రాణములు దక్కినఁజాలు" నని బీగములఁ దడాలునఁ బాఱివైచుటంబట్టి, "నిర్లక్ష్యముగా బీగములు పాఱవైచినాఁ" డనియు, దీనిచే నెచటనో యింకను ద్రవ్యము నిక్షేపించినాఁ" డనియు, దురభిప్రాయులై "యింక నీయాస్తి నెచట నిక్షేపించితివో చెప్పెదవా? ఇదె నీకూఁతుల లాగున నీకుత్తుకఁ గూడ నిర్మూలింతుమా?" యని శస్త్రమును మంచముపైఁ బండుకొని యుండుపసికూనలకుత్తుకలు దంపతుల పాదములపైఁ బడినను జరాలున నాకఱకుఁగరవాలమునఁ గంఠమ్ముల నుఱుమాడిరి.

సౌ—హా! మహారాష్ట్రాధములారా! హా! మ్లేచ్ఛాధములారా! ఎంతపాప మొడిఁ గట్టుకొంటిరిరా! తరువాత నేమి జరిగినది?

ప్ర—పిమ్మట నేలం బొఱలునావైశ్యదంపతుల నాదురాత్ములు తమకఱకుఁబాదములం దన్ని "ఓరీ! వైశ్యాధమా! చెప్పవుగా! చెప్పవుగా!" యంచుఁ బల్కి యాయనభార్యకడ నున్న చంటికూనను బలిమిని లాగికొని వారలకుఁ జూపుచుఁ గట్టెదుట గచ్చుపై గభాలునఁ గొట్టి కాలితో నలిపివైచిరి. మఱియు,

సౌ—(అనునంతఁ జెవులుమూసికొని) చాలును, మఱి చెప్పవలదు, వినఁదరము కాకున్నది. ఛీ! భ్రూణహత్యాపరాయణులారా! ఛీ! హతాశులారా! మీకేమిమూడినదోరీ! స్త్రీహత్య యనక, శిశుహత్య, యనక బ్రహ్మహత్యను స్మరింపక, ఆస్తుల నొప్పగించి మేఁకలవలె నున్నను గాఠిన్య మొందనవి హృదయములా? పాషాణములా? హా! ఏకేశ్వరా! ఏనాఁడైన మేవాడరాణావారు నీయెడఁ గృతఘ్నులైరా? తాము ప్రజాసౌఖ్యకరము లగుకార్యముల నాచరింపుచు, నీరాజ్యభారమంతయు నీయందే యుంచి, తావకపదకమలానుసంధానితమనస్కులై యుండ, నట్టివారికి ననర్థతఁ గూర్చి, సకలజనపీడాకారణుఁడవై యుంట ధర్మమా? (అని నిట్టూర్పు నిగుడించి,) ఓయీ! ఇట్లు ప్రతిదినమ్మును వారు పెచ్చు రేఁగుట వింటయే కాని, యీరీతి ఘోరకృత్యముల నాచరించుట వినలేదుసుమా! ఎంతఘోర! మెంతఘోరము! ఇఁకఁ బొమ్ము. నీపనిఁ జూచుకొమ్ము.

ప్ర—(నిష్క్రమించును)

భీ—బావా! ఈదౌర్జన్య మణఁగి స్వాస్థ్య మెట్లబ్బు?

సౌ—బావా! కర్మపరిపాకము గాక నీబాము లెట్లు పోవు?

భీ—బావా! నీవలన సమస్తధర్మములు విని; బాల్యమున నభ్యసింపఁబడినదుర్వ్యసనముల నన్నిఁటినిఁ బరిత్యజించుట మీ రెఱుంగనిది కాదుగదా? నే బాల్యమున నుంట మాతల్లిగా రీరాజ్యమునంతయు నిట్లు దుస్థితులపాలు సేయుటయుఁ జెప్ప నేలా? కావున మన మీయెడఁ జేయందగుకృత్యమును, బ్రస్తుతపుదేశసమాచారమును దేటపఱిచెదరుగాక.

స్వా—బావా! మీతల్లిగారివలన నే మనరాజ్యమున కింతచేటుమూడె ననుటకు సందియములేదు. ఏలయన.

ఉ. చా వనుమాట నెంచక విశాలబలంబునఁ బోరుచుండుచుం
దావతులన్, యశమ్మునఁగనందమతుల్యులఁ జేయ నెంచి, "సూ
క్తావతు" లెంతయున్ రణమదమ్మున ము న్రిపులన్ జయింప రే?
యేవము! వారలిద్దఱకు నీయమ యాల మదేల కొల్పెనే?

కాన నారీతి రణరంగవీరులై ప్రఖ్యాతి గనినకుటుంబము గావునఁ జందావతుమంత్రికుటుంబమువారు పరాక్రమలవదుర్విదగ్ధులైన నాదురుగాక, అట్టిమొడ నాయమకు స్వాభ్యుచ్ఛ్రియకాంతుయే యున్నయెడల వారలపూర్వపురుషులకు రాజ్ఞావిషయమై గలభక్తివిశ్వాసములతోఁ గూడినచరితములఁ జెప్పియో, యొండెమఱికొన్ని హితవులఁ గఱపియో, యేలాగుననైన మంచిత్రోవ ద్రొక్కునటులఁ జేయవలయును గాని, యిట్లామంత్రికుటుంబములవారికి నంతఃకలహములఁ బెంచుట పాడియా? దానిచేత నేకదా! మనకోట కింతచేటు మూడినది. ఏరాజ్యమునందైన మంత్రులు కలహించుకొని యితరేతరసంవర్ధితక్రోధాగ్నిప్రచండులై యసిధారలరక్తధారలొలుకనాధిపత్యమును వీ రంత మొంద వారు, వా రంత మొంద వీరును, గానుట గంటివా? ఎందైనను వింటివా? విత్తమదచిత్తులు గాక యీమాత్రమైన నను జూచికొనవలదా?

భీ—బావా! ఆయమయట్లు తగులఁబెట్టినది. నే నేమి సేయుదును?

స్వా—కాని బావా!

ఉ. ఆయమ కేమి యాఁడుది, సకమంచితశక్తిని శత్రుకోటిపై
డాయరె సింగులెల్ల? రకకటా! యిఁక వారలశక్తిఁ గాంచి నీ
వే యవనీశ! పోరఁ దగవే? మగవాఁడవు గావె? యింతకున్
బోయినసద్యశోరమను బొందొడఁ గూర్పగ శక్య మేరికిన్?

భీ—బావా! సుగుణప్రభావ! ప్రజలెల్లరకు శత్రుసంకట మధిక మౌటచే స్వామి భక్తి యేరియందును నంకురింపదాయె. నే నేమి చేయుదు?

సౌ—రాజా! ప్రజలకు శత్రుసంకట మనుకొంటివా యేమి? అది య ట్లుండనిమ్ము, ఆసంకటముల మించినసంకటము మనలవలననే కలుగుచున్నది. ఎట్లన:—

చ. ఇరువురుమంత్రు లిప్డు పొగరెక్కి జయమ్మునుబొందువారు సం
బరమున "మాదిరాజ్యము సుమీ" యని పట్టి పలార్చి యెల్లరన్
గరువము దాల్చి, దండన రకమ్ముగఁ జేయుచు నంతకారికిం
కరు లయి లేనిపోని వనఘా! గనఁగాఁ గొనరే? కరమ్ములన్.

ఈవిధమునఁ గప్పములఁ గొనుచు, సమస్తరాజసత్కృత్యములఁ జల్పునీమంత్రులకంటె శత్రులు వేఱె యుందురే?

ఉ. మత్తగజద్వయం బిల సరిమానముగా బవరం బొనర్చి మేల్
బిత్తరి లేడిపిండును జలింపక చంపెడురీతి నిప్పు డీ
మత్తులు పోరు పోరియు నమాయికులై యలరారుచుండు నీ
పత్తనరాష్ట్రవాసులను బాధలపాలుగఁ జేయుచుండరే?

భీ—బావా! అట్టిక్రౌర్యము గలవా రౌటనే కదా! యే మనుటకును భీతి యగుచున్నది.

గీ. చండతరకోపవేగవేదండయుగము
పోరుచుండంగ దండకుఁ బోదుమేని,
గండు మీఱినబలితంపుఁ దుండమునకుఁ
జిక్కఁ జేసియు నేలకుఁ ద్రొక్కకున్నె?

సౌ—ఓయీ! బావా! భీరుస్వభావా!

ఉ. ఇంతటిమేటివై యలరు చెంతయు నే నిఁ కెఱుంగువాఁడ ర
వ్వంతయు శక్తి యున్న నిటు లందువె? "నీయెడ లేదు తప్పు, గా
కెంతయు శత్రురాడ్బలదురీత్యులు నీప్రపితామహుల్, యశో
దంతురితప్రభావులు, సర్దారులునై యలరార నంటిఁ గా,

కాని, యోయీ! బావా!

చ. చిమిడిన దంత యిప్పు డిఁకఁ జేసెడి దేమియు లేదు, నీదు రా
జ్యమునకు సౌఖ్య మీపయిని నైనను గల్గఁబోదు సుమ్మ; నీ
కమలుఁ డొకండు లేఁడు, గనఁ సంతతిశక్తియు లేదు నీయెడన్;
భ్రమలిఁక మాను, మంత్రులిటు పట్టము నేలుటయున్న చెప్పుమా?

భీ—ఔ, నంతయు నిజంబు. నే నేమి చేయుదు? సాధ్య మైనంతవఱకు యత్నించెద.

సౌ—రాజా! మన రాజ్యమునఁ బ్రతిదినమును జరుగు నక్రమములన్నియు విని యేయుంటివి కదా! ఆ ప్రజలబాము లాయీశ్వరుఁ డెఱుంగుఁ గాని చెప్ప నేరికిఁ దరమౌను? ఇంక మన దేశపుస్థితి వినుము.

భీ—ఔను; మనవారలయంతఃకలహములనుండియే కదా యింత యనాడికి వచ్చుచున్నది. సెలవిండు.

సౌ—ఔరంగజేబు చచ్చుట వానికొమరు లగు మ్లేచ్ఛులు రాజ్యముఁ జెంది, మద్యపానాయత్తచిత్తులై తమకును రాజ్యమునకును నాశముఁ దెచ్చుకొనుచుండిరి. వారలదురవస్థలకుఁ గూడ రాజ్యము మంత్రులయధీన మౌటయే ముఖ్యహేతువుగ నెఱుంగుము.

భీ—మనకుఁ బ్రత్యక్షమే. పైని?

సౌ-శా. నష్టప్రజ్ఞుల వారిఁ గాంచి మది నానందంబుతోడన్ మహా
రాష్ట్రుల్ బీరముతోడఁ బోరుచు, నపారంబౌ మదోద్రేకసం
తుష్టిన్ దేశము పంచికొంచు, మదిలో దుర్దర్పముం జెందుచున్
గష్టావిష్టను జేయుచుండిరి భువిన్ గామప్రకర్షాత్ములై.

భీ—ఆమ్లేచ్ఛులకుఁ గావలసినదే! పిమ్మట?

సౌ-సీ. తల లెత్తి సీకు లుద్ధతశక్తి రాజ్యంబు
గొంచె ముం దంద స్థాపించ లేదె?
నొకమూల నాంగ్లేయు లొకటను బ్రాన్సునా
ర్మెలపుతోడుత నాక్రమించ లేదె?
దక్షిణాశాగతోద్దండమహారాష్ట్రు
లడలంగఁ జించి చెండాడ లేదె?

ఐకమత్యవిహీనులై రాజు లంతటఁ
బాడిగా దనకేఁ బోరాడలేదె?
గీ. కార్యకారణములు నుంత గానకుండి
కయ్యమే యంచు నెప్పుడుఁ గాలు ద్రవ్వి
యెంతయును భూమి రక్తభూయిష్ఠఁ జేయ
నింకను గనఁ దేట పడును గాకటకమునూటు.

భీ—ఆహా!! దేశమంతకు నెంతటిదురవస్థ యబ్బినది?

సా—ఇట్లు మితిలేనిసంగరములు జరుగుచుండ దేశదేశమునకు క్షణక్షణమున కొకొక్క కొక్క క్రొత్తరాజ్యమును, దౌర్జన్యమును, నిక్రొత్తకొండ్లవలనఁ గలుగుప్రజాసౌఖ్యములును, జెప్ప నేలా? దీనికిఁ దోడు వినుఁడు.

భీ—వినుచునే యుంటి సెలవిండు.

సా-సీ. కాబూలుపారసీకములమ్లేచ్ఛులు దాము
దండు వెడలి భూమి నిండుకొనుట
పచ్చిమాంసము కల్లు విచ్చలవిడిఁ గ్రోలి
చెఱఁ బట్టియును స్త్రీల నులుకుచుంట
పాత్తులై కుత్తుకల్ దుత్తునియలఁ జేసి
మెల్లమెల్లన నూళ్లఁ గొల్లఁగొనుట
దేవళంబులఁ గడతేర్చి యందుల నుండు
విత్తంబుఁగొని పిట్టపీఁగుచుంట
గీ. దేశమంతయు నాశనదేవతకును
బట్టమునుఁ గట్టు టదియు నూఁక్కొట్టు నేల?
యందఱకు మిక్కుటంబుగా ననుభవించు
చుంటిమే గద! నేనింక నంట యేల?

భీ—నిజమే మనమును, బ్రజలు, ననుభవించుచునే యుంటిమి.

సా—బావా! ఇట్లు దుర్వారవైరివారపరవేష్టితులై,
చ. మొలకువ లేక యిండ్లను నిరమీలితలోచనులై పరుండఁ గా
నలుదెసలందు బిగము లనంతముగా బిగియించి చిచ్చిడక్

మలమలమాఁడురీతి రిపుఱమాండలదావపరీతులై మహా
కులతను బొందుచుండి రనుఱకో! మనభారతవాసులెల్లరున్.

భీ—అట్లనుటకు నిస్సంశయము. పాప! మట్లనే మాఁడుచుండిరి.

సౌ—బావా! ఈకష్టములన్నియు మనవి సగము, మిగిలిన లోకమంతటిది సగముగ నెఱుంగుము. ఏలయన; నీరాజ్యము నుద్ధరింతురేమో యని యామరాటుల సాహాయ్యముఁ గోరితివి; అదియే కొఱవితోఁ దల గోకికొనుట యైనది. ఆహా! పూర్వ మెవ్వరైన మనచిత్తూరుఁ దేఱిచూడనైరే? ఉదయపురమును స్వతంత్రముగ స్వీకరించి, కప్పములఁ గట్టించుకొనిరే? నేఁటికిఁ గదా యానరాధముల నీవు సాహాయ్యముగఁ గోరుట నవియన్నియుఁ బటస్థమైనవి.

భీ—బావా! వీ రేమియో యుద్ధరింతు రనియే కోరితిఁగాని, యీరీతి ద్రోహులౌదు రని కలగంటినా?

సౌ—బావా! దానికేమి; నిన్నుఁ బొడగాంచిన విచార మగుచున్న యది ఏలయన:—

ఉ. దేశ మదిట్టు లుండెఁ గడుఱ దీనులు తాకరాష్ట్రవాసులున్;
కోశములోన ద్రవ్య మొడఁగూర్చుట లే; దలకాలపాశసం
కాశులు నీదుమంత్రులు; లవఱకాశము లే దిఁక నెందుకైన; స
ర్వేశుఁడు నీపయిం గృప నిఁకెట్టులఁబూనెనొ? చెప్ప లేముగా.

కానరాజా! నిన్నును, నీప్రజల నెట్లు గాఁపాడు కొనెదవో గదా?

(తెరలోఁ గలకలము)

భీ—(విని) ప్రతీహారీ! అదేమిరయో? తెలిసికొని రమ్ము.

ప్ర—చిత్తము, దేవా! (అని నిష్క్రమించి ప్రవేశించి) దేవా! దేవరమేన యల్లుఁడు ప్రభాసింగుగారు దేశలములఁ గొల్లపెట్టుచున్న లగుమ్లేచ్ఛాధులకుఁ జిచ్చఱపిడుగై చించిచెండాడి హతశేషు లగువారలఁ బట్టి బంధించి, పురజనులు వెంబడింపఁ దా దేవరసన్నిధానమునకు వచ్చుచున్నారు.

భీ—(తత్తరపాటుతో) సరదారు లెవ్వరైనఁ దోడైరా? ఆకస్టుఁ డొక్కఁడేనా?

ప్ర—ఆయసహాయశూరునకు సరదారులు తోడౌటనే మఱింత విజయి యైనాఁడు.

భీ—బావా! చూచితివా? ఒకచెంపఁ బాలును, వేఱొకచెంప నీరును, గలయా

యన నెవ్వరైన నియమించిరా యేమి? చదువు మాని యిట్టిసాహసమునకు దిగుటా?

ఉ. ఒక్కటె చెల్లె, లామె కితఁడొక్కఁడె కొడుకుఁడు; తండ్రియీవిధిన్
పెక్కగ ముచ్చులందునిమిఁ బేర్వడిచచ్చెఁ; దదూర్ధ్వభాగమున్
ద్రొక్కఁగ సాగె నీతఁ;డలదోర్బల మబ్బెనె? యబ్బెఁగాక; యీ
చక్కటి చూచితే, నయవిశారద! కుఱ్ఱలచేటుకే గదా?

సౌ——ఓయీ! బావా! ఇట్లనెదవేలా? నీవునంబున నిట్టుండఁగాదు. ఏలయన.

చ. మును మనసింగులెల్లరు సమున్నతవిక్రములై పరాక్రమిం
చిన తెఱఁగీ వెఱుంగవె? విచిత్రముగా మనరాజకాంతలిం
కను బవరంబొనర్చి మును గాంచరె సద్యశ? మట్టిమేటులౌ
గానబుకులానఁ బుట్టువుల కున్ మఱి విక్రమ మీడఁబోవునే?

అయిన నిప్పటిమనస్థితినిబట్టి యనఁదగినదే? పూర్వమేమైన.——

క. చిన్నతనంబున నిట్టుల
నెన్నం దగుపనుల నెవ్వఁడేనియు సలుపన్
గ్రన్నన బిరుదంబుల నిడి
పన్నుగ నగ్రాసనాధిపత్యం బీరే?

(అంత యథోక్తముగఁ బ్రభాసింగు ప్రవేశించును)

సౌ——బావా! చూచితివా నీయల్లుని? (అని సంతోషముతో)

ఉ. అల్లదె! చూచితే కొలమునందుఁ బునర్భవుఁడైన "బాప్పరా
వ" ల్లిటు శక్తిచేతఁ బరిపంథివిమర్దన మెంత చేసి, తా
నెల్లర కాదరాస్పద మగదే! యటు గానఁగవచ్చు, నీదు మే
నల్లుఁడు చూడు మీయెడ, నరాధిప! యాతనిదైన వేసమున్.

సీ. జిలుగుమోమునఁ జిఱుచెమ్మటల్ గ్రమ్మ, వి
జయలక్ష్మిగుట్టు తాఁ బయలుపఱుపఁ
బరిపంథిజనభయంకరుఁడు తానై యొప్పఁ
గేల వాలు మఱింత డీలుపఱుప

డాకాల గండపెండెరము లేకయె మత్త
కరియాన మొక్కటే మురువు సూపఁ
బైనున్న హొంబట్టుఁబవడవాటు చిఱునవ్వు
తతవిశృంఖలపవిత్రతను దెలుపఁ

గీ. జేతు లెత్తుచు జనులు జే జే లొనర్పఁ
దేటగా నూఁగుమీసముఁ గీటుకొనుచు
వచ్చె నదె! చూడు పెద్దలవంటివాఁడు
విద్దెలకు తేఁడు చూపఱముద్దులాఁడు.

(అంతఁ బ్రభాసింగు మొదలగువారు రాజునకు నమస్కరింతురు)

భీ—(ప్రభాసింగును కౌఁగిలించుకొని) బాబూ! ఎందు కిట్లేఁగితివోయీ! మనసరదారులనైన సరకుగొనక, కటికవృత్తిని జీవించునీమ్లేచ్ఛాధములను, మహారాష్ట్రాధములకు నీ వెఱుఁగకుంటివా? నీ కాయుద్ధప్రసంగము లేమైనఁ దెలియునా? చదువు మాని సాహసమునకు దిగుట మంచి యానటరా! తండ్రీ! నీతండ్రిగారు కూడ నీవితమునకే మ్లేచ్ఛుల హతముచేసి హత్తముచేసి, తుదకు వారిచేతనే హతు లౌట యెఱుఁగకుంటివోయీ! ఎంతపని చేసితివి? నిన్నెవరైన నిర్బంధపెట్టిరా యేమి?

ప్ర—(తనలో) ఏ మిదీ! ఈయన కింత పిఱికిదయ్యె మావేళ మైనది? (ప్రకాశము) మామయ్యా! ఇట్లనుచుండిరేలా? హాని వచ్చు ననియే కదా?

ఉ. పుట్టినవార లేరు తలఁపోయఁగ శాశ్వతులై ధరాతలిన్
గిట్టక యుండు? రెడ్డి పరికించిన వెంటనె రాఁ దొడంగు? మీ
మ ట్టిదిమూడఁగానుపమానమొ? తుచ్ఛమొ? యెవ్వరేసియుం
బుట్టినయింటిపౌరషపుఁబోఁడిమిఁ గూడఁగఁ జేయుఁ; జెప్పరే?

భీ—అయ్యో! వెంగలీ! "పుట్టినవారు గిట్టక తప్ప"రని కోరియగ్నిఁ జొఱ నీయకొందురా?

ప్రభా—అట్లైన మామయ్యా!

చ. అనుభవయోగ్యమైనసుఖ మందఁగ శక్తుఁడె? కష్ట మట్లనే
కొనఁగ నశక్తుఁ డయ్యె! తనకున్ మఱి యేరికి నైన భూమిలోఁ

బానిసపనాని దంచుఁ దలఁబోసియు మిన్నకయుంట పాడియే?
కనుక మహానుభావ! ఘనకార్యముపట్లను జింత సేటికిన్.

ఇంతియ కాక, మామయ్యా! మీకుఁ దెలిసినను బెద్దలమాట గావున నుడువుచుంటిని గాన క్షమించి యాలింపుఁడు.

ఉ. పౌరుష మన్నిటం గడుశుభం బని పల్కుదు రద్ది లేక కా
పూరుషజీవ మొందుటనుఁ బూజ్యుఁడె? యెందుల నైననింక నా
పౌరుషశాలియై యలరుఁబావనిఁ జచ్చిన జీవి యందు రా
పౌరుషహీను నందురు "శవం" బని చచ్చిన జీవముండినన్.

భీ—అయ్యో! పిచ్చివాఁడా! విను మాసంగతి విశదపఱిచెద.

చ. వినయము పెద్దలందును, వివేచన శాస్త్రముపట్ల, భక్తి యా
యనుపమశక్తిభాసురునియందు, సమత్వము ప్రాణికోటిపైఁ,
దనరి, సమస్తకార్యములఁ దాల్మిని జూచుచుఁ గీర్తిదంబులౌ
— ఘనవనసత్రిసన్మతి నికాయ మొనర్చిన జీవి చచ్చినన్.

ఇదియ పౌరుషము. ఇంతియకాక, మున్ను మిన్నుఁ గానక, స్వబలపరబల న్యూనాధికభావముల నెఱుంగక, ఘనాభిమానహీను లగుమేచ్ఛాధమాదులపైకిఁ బరువు లిడి, చదువు సంధ్యల నీటఁ గలపినంతనె పౌరుష మనుకొంటివా యేమి? ఇట్టితుచ్ఛులఁ బైకొన నేతప్పో యోజింపుము?

ప్ర—(తనలో) అన్నా! ఈయనతో శుష్కవాదము శటస్థమైనదే! పెద్ద లగుట నే మనుటకుఁ జంకగుచున్నది కావున నెట్టులైనఁ బెద్దమాటలుమాని, ప్రస్తుతోచితముగనే యుందము.

సౌ—(తనలో) ఏమీ! ఈయనయవివేకము? తా సంతసించిన సంతసించుఁ గాక, లేకున్న మానుఁగాక. అంతియ కాని యిట్లుతూలనాడు టేమిపాడిగనున్నది? (అని నుడువంబోయి సంశయముతో) మన కెందులకు? ఆయనయే చెప్పఁగలఁడు.

(సరదారు లొండొరులం గూర్చి రహస్యముగా)

మొ. వాఁడు—ఓయీ! ఈయన మనము చచ్చిన సరే యని పురిగొల్పుచుఁ, దనవార్ధక్యానఁ దోడు గాకుండ నెట్లు బోధించుచున్నాఁడో!

రం. దు—అందులకే! కోట యింత వృద్ధిలో నున్నది.

ము. దు—ఏమిదీ యీయన యవివేకము? ఇచటనే యనవలెనా? మన కెంత సంతసము? ఆయన కెంత యానందము.

నా. దు—ఈయనమాటలకుఁ జిన్నపోయి యాపిల్లసింగ మేమియో యను నట్లున్నది; వినుండు. ఈతనిస్వభావ మెఱుఁగమా యేమి?

ప్రభా—మామయ్యా! మీరు సెలవిచ్చినఘనవనసత్రసన్మానాదు లొనరించుట యెందులకు? కీర్తి సంపాదించుటకేగదా?

భీ—అందులకే యని నొడువలేదా? కా కేమి?

ప్రభా—అవి యొనర్చినఁ గీర్తివంతు లెట్లయ్యెదరు? అవి జనోపయోగము లౌటనేకదా?

భీ—కాక; స్వోపయోగార్థ మౌటనే యంటివా యేమి?

ప్రభా—పౌరుష మనఁ బురుషకారమా? వేఱొకటియా?

భీ—కాఁగాక, ఏ మనియెదవు?

ప్రభా—జనోపయోగము లగుకార్యములఁ జేయఁ గీర్తివిశిష్టు లౌట కీయాటంకమును లేదుకదా?

భీ—తనతలకుఁ దగినజనోపయోగము లగుకార్యముల నొనర్చిన నెటుల నాటంక ముండు?

ప్రభా—మామయ్యా! బాగుగ నుడివితిరికాని,

ఉ. ఏ నిది సేతు నీవగిదికేని నిష్టుడటంచెద నిశ్చయించి తాఁ
బూనినఁ బూనుఁ గాక విధికిన్ బూనిక లేక పొనర్చు టెట్లు? దాఁ
బూనిక గల్గి యున్న విధికిన్ బూనికతోడన సేయ నేర్చెడిన్
గాన నొనర్పఁ బూన విధికిన్ కల్గిన నయ్యెడు, నొండె మానెడున్

అంతియకాని "తనతలకుఁ దగనిదికా," యని మిన్నకుండఁగలమా? కాని యాదీను లగుప్రజలబాధలఁ గన్నులారఁ గాంచుచు, నేకతినాత్ముఁడు మిన్నకుండఁ గలఁడా? ఇంక వారిబాముల వారోన నూఁకోనఁ గూడ సమర్థులు లేరన నెవ్వ రంగీకరింపరు?

చ. "కనులకు నిద్ర రాదు; కడుకన్ గండ్లను గాంచఁగ జేఁడు లేఁదు; చే
కొనినముఁ గాంచు వారెవరొకో!" యని యేడ్చుచునుండుఁ దిండిమాం

తనువున నీరుగాఁ బరిణతం బగు"నంచును నెంచుచుండు ; వా
కొన నిటఁ జాల "శత్రువులకోర్తలివే"యని రాజచంద్రమా.

సౌ—(తనలో) వా! కేసరికిశోరకమా! వా! వీరాగ్రేసరా! ఏమియుక్తిగ భాషించితివి. సెబాస్ చాలునురా; తండ్రీ చాలునురా?

భీ—(విసువుతో) అబ్బా! ఇప్పటికుఱ్ఱలతోనైన మాటలాడ లేమండీ!

సౌ—(మందహాసము సేయును)

ప్రభా—నే నిట్లెఱిఁగియు రెండుకారణముల వలనఁ బోవక తప్పినదికాదు.

సౌ—ఏ వానిర్బంధములు?

ప్రభా—ఒకటి మాగురువులవలనను, రెండవది కృష్ణాకుమారివలనను.

భీ—వారివలన నీ కేల కలుగవలె? వారా నీకు నియామకులు?

ప్రభా—వారు నిమిత్తమాత్రులు గాని, మాగురువుగారి దురాత్ములవలనఁ బడినబాములే నియోగించినవి.

భీ—ఆయననుగూడ బాధించిరా యేమి?

ప్రభా—మనగురువు లని యూరకుండువా రనుకొంటిరా యేమి?

భీ—అన్నా! ఆయనను గూడ బాధించిరా?

ప్రభా—మిక్కుటముగ ననుభవించినవారియం దాయనయే మొదటివాఁడు.

భీ—బాబూ! ఈదురాత్ము లాయన నేమిచేసిరి!

ప్రభా—మామయ్యా! చెప్పనాతరము కాదు, వినుటకును జాలెడువా రుందు రన రాదు. (దృష్టినిగుడ్చి) అదిగో! [illegible] యిటకే వచ్చుచున్నాఁడు, పాప! మాయనయాత్రముఁ జూచితిరా? అదే చూడుఁడు.

ఉ. జందెము జాఱుచోఁదనభుజం బెగఁజిమ్ముచు, బొజ్జ నూఁపుచున్
జిందఱవందఱై చెమట చిమ్ముచుఁ బాఱఁగ నొక్కపక్కనన్
విందమటంచు రా వెనుకపిందెయు జాఱఁగ, వచ్చుచుండియే
తొందరతోడఁ గేల నెగఁద్రోయుచు నూర్పులు పుచ్చివచ్చెడిన్.

చూచితిరా? ఆయన యెల్లరకు మిక్కుటముగాఁ గీడ్పడె ననుట కాతొందరయే సాక్ష్య మిచ్చుచున్నది.

(అంత యథోక్తముగ గురువు ప్రవేశించును)

(ఎల్లరు లేచి నమస్కరింతురు)

గు—రాజేంద్రా! ఈ క్రముచ్చులను బంధించినమేటి నాశిష్యుఁడే నా?
భీ—చిత్తము, తనతలకుఁ దగినపని యని యాలోచించినవాఁడు కాఁడు.
గు—(రాజువైపునుండి దృష్టినిమరలించి) నాయనా! కుమారా! ఇటురమ్మా.
(అంతఁ బ్రభాసింగు దరి చేరఁ గౌఁగిలించి)

చ. గురునకు బాధ సేసి రణకూళ్లపైకి నొకింతయేని సం
గర మనుభీతి నీమదిని గాంచక పోతివ? నీకు నిట్టియా
దర మది గాంచ నెవ్వరి కతంబునఁ గల్గెనె? వీరి నెట్టులో
క్రూరుఁడవు గండడంచితివి? కాయము కోమల మయ్యు బాలకా?

ప్రభా—గురువరా!

ఉ. ప్రాణము పోవనీ గురుపరాభవ మెవ్వఁడు చూడనోపు? నే
కోణములోన సన్మతిని కూర్చెడువారలు? మీవచఃపరి
త్రాణుఁడ నయ్యు నే రిపుమదం బణఁగించితి; నొక్రూరుండనై;
ద్రోణుని బోలుమీకతనఁ గ్రమంచుటలక్ష్యమె? యీదురాత్ములన్.

కాని, గురూత్తమా? పరాభవప్రతీకారములెన్ని చేసినను, బరాభవ మొండు గల్గించితిమి కదా యను పరితాపమావరించి దేహమంతయుఁగాల్చుచున్నయది.

గు—కుమారా! నీ విందుల కెంతమాత్రమును జింతింపకుము.

ఉ. ఎంతటివారికైన బలుకెందలో గావఁగఁ జుట్టుముట్టినన్
వంత విధాత యొంచిన ల[illegible]బును గాచుట సున్న నా కిదే
సంతస మీకులోన్నతయశంబును నిల్పితి వింక నన్యమౌ
చింతన; మానుమా? సుఖముఁ జెందుము! దీవనతోడ బాలకా.

ప్రభా—గురువరా! అనుగ్రహింపఁబడితిని, మీవాక్యము లమోఘములు కదా!
సౌ—ఆచార్యా! మీ కేమె ట్లొనర్చె రీదురాత్ములు?
గు—అయ్యా! ఆబాధలన్నియుఁ దలఁచుకొనిన నాగుండె యిప్పటికిని నవియు చున్నది.
సౌ—అట్లేని సంక్షేపముగ సెలవిండు.
గు—అయ్యా మొన్నటిరేయి రెండుయామములు గడచినతరువాత నీదుష్టులెల్ల రేకమయి నాయిలు సొచ్చిరి; చొచ్చి మంచముపైఁ బండుకొనియుండు నా

మీఁపుపై నెవఁడో గభాలున నొక గ్రుద్దుగ్రుద్దినాఁడు, నే నంత భయంపడి “మ్లేచ్ఛాధములు! మ్లేచ్ఛాధములు! చచ్చితిఁ జచ్చితి!,, యని కేక వేయ నుంకించితిని గాని, యీనరాధములు దౌడలు బిగియ నొక్కుటచే నిష్ప్రయోజనమైనది.

సౌ—హా! ఏమీ! వీరలస్వాతంత్ర్యము! పైని—

గు—అంత నొకఁడు నాశిఖ చేఁబూని, కూర్చుండఁబెట్టి, కత్తి ఝుళిపించుచుఁ దల నొకమూల వెంట్రుక లెక్కవచ్చులాగున గుంజించి యూఁపియూఁపి, “కేక వేయుదువుగా, కేక వేయుదువుగా?” యంచు గ్రుడ్లెక్కవెట్టి చూచుచు, గోడకుఁ దాఁకి తలవిచ్చునట్టుల మూఁతిపైఁ దన్నినాఁడు.

సౌ—ఛీ! ఎంతపని చేసితిరోరి!

గు—పైని వినుండు, అంత నాచెంత నుండు బీగములు లాఁగికొని, యిలుసొచ్చి, యాస్తినంతయు కొల్లగొని యందొకఁడు నాజుట్టు చేఁబట్టి రోమకూపముల వెంబడి రక్తము స్రవించులాగున నూఁపియూఁపి, నట్టింటఁ గూర్చుండఁ బెట్టె.

ప్రభా—(కనులు జేవురించి తత్తరముతో) ఛీ! హతాశులారా! ఛీ! బ్రాహ్మణద్రోహులారా! ఇదె మిమ్ములఁ గూడఁ గండకండలుగఁ జెండి కాకులకు గ్రద్దలకు బలి యిచ్చువాఁడ. ఇదె గురుప్రీతి సేయువాఁడ. (అని కత్తిఝుళిపించుచుఁ బోఁబోవ)

సౌ—(నడుము గట్టిగఁ బట్టుకొని) నాయనా! కుమారా! నీ వీఘోరకృత్యమునకుఁ దలపెట్టకుము, అందులకుఁ దగినవా[illegible]ండనే యుండిరి, చెండినవట్టు చెండనే చెండితివి. చాలదా? (అని [illegible]) ఆహా! ఏమీ! యీగురుభక్తి! ఏమీ యీరోషము! చాలును రా బాబూ! చాలును రా! (ప్రకాశముగా) బాబూ! గురువులమాట జవదాఁటకుము, పొమ్ము! కూర్చుండుము! (గురువువంకఁదిరిగి) ఆచార్యా! అంతతోనైన మిన్నకుండిరా? లేదా?

గు—చంపక మిన్నకుండిరి, కాని బాబూ! పైని వినుండు, నన్నట్లులాగికొనిపోవ “నిర్దోషుల బాధింపకుఁడు, నానోము తాలింపుఁడు, పాపమునకు వెఱవుఁడు. అని పాదములపైఁ బడి యెంత పొరలినను దయావిహీనులై నాచుట్టును మూఁగి యందొకఁడు

శా. “ఓరీ! ప్రేలరి! నీతులా? యిఁకను నీకవొప్పింపవా యాస్తి? యం
చేరీపిల్లలు? చూపుమీ! చనుము, నీకయిల్లాలదేది? యిదే

నోరుగా విప్రుమీఁకూతునంచు మఱియొకన్నొ గెంటులం గెంటెన
న్నారీతి నన్నడియింటఁ గొట్టెను ప్రకోపాపూరితస్వాంతుఁడై.

మఱియుఁ దదితరు లగుదుర్మార్గులెల్లరును నాచుట్టుముట్టి యొక్కొక్కఁ డొక్కొక్కవిధమున బాధించె; నదియుఁ గొంచెము వినుండు.

సీ. పొట్టపైఁ జేతితోఁ బొడిచి కుక్షింభరా!
యంచు భూమిని బొరలించె నొకఁడు
కన్ను గానక నాదు జన్నిదంబుల వేడ్కఁ
దీసి వేఱొకనికి వేసె నొకఁడు
గడ్డంబుగాఁ బిల్కఁ గట్టిన నీతండు
సాయబే యని కేలఁ జఱచె నొకఁడు
మాంసం బెఱుంగకే మత్తుఁ డిట్టుల నుండె
నదియున్నఁ జెప్ప లే మనియె నొకఁడు
గీ. కుందవలె నుండెరా! యంచు గ్రుద్దె నొకఁడు
కండమొం డని నిండుగాఁ గఱచె నొకఁడు
త్రోసి వీఁపున నాట్యంబు చేసె నొకఁడు
గడ్డమును గీటి మిడిగ్రుడ్లఁ గాంచె నొకఁడు.

భీ.—ఛీ! వీరలఁ జూడరాదు. వీరేక[illegible] దగియుందురో యట్లె తక్షణము కావింపుఁడు, పొండు.

సా.—"ఏదియో" యన నేలా? కండకండలుగఁ జెండుటయే.

ప్రభా.—(కోపావేశముతోఁ గత్తి త్రిప్పుచుఁ బోయి యిరువురగడ్డములఁ బట్టి యీడ్చుచు) ఓరీ! మాంసాశనులారా! ఓరీ! కటికబానిసలారా!

చ. అతికరుణావిశాలు, నిగమార్థవిచక్షణు, సర్వలోకసం
మతు, నతివృద్ధు, నాగురుని మత్తత బల్ పొగరెక్కి బాధలా
వితమునఁ జేసినా, రనుభవింపఁగఁ జేసెదఁ దత్ఫలం బిదే
నత మను కొంటిరోరి! కడసారినమస్కృతి సేయఁ బాడియా.

(అని కత్తియెత్తును)

గు——(తత్తరముతోఁ జేయి పట్టుకొని) నాయనా! కుమారా! నీ వీపట్లు శాంతింపుము.

చ. రణమున డీకొనన్ రిపుల రాజులు ద్రుంతురు కాని; యిట్లు కా
రణముగఁ ద్రుంతు రయ్య! బవరంబున కిష్టము లేనివారలన్?
గణనకు వత్తురా? బలుమగండవు నీ కిఁకఁ జెప్పనేల? త
క్షణము దురాత్ములన్ విడు, మకారణపాపము సెందనేటికిన్?

ప్రభా——గురువరా! ఇదె నమస్కారము, ఏది యెట్లైన నీపట్ల నాయుద్యమము న కంతరాయము గావింపకుఁడు.

సా——నాయనా! కుమార! గురువులమాట గూడ మీఱ నెంచితివా యేమి? ఈదు రాత్ముల నెట్లైన హతమార్చకఁ దప్పదుకదా? నీవే చంపవలెనా? చేఁజిక్కిన వారలఁ జంపుటా పౌరుషము? గురువులనైన సరకుగొనక; వచ్చినకోప మంతయుఁ గ్రుమ్మరింప మంచియగానా? కావున నీ వింతతో విరమింపుము.

ప్రభా——(వారలగడ్డములు విడచి తనలో)

అన్నా! ఈయిరువురు రెండంకుశములవలెఁ దటస్థమైరే! పితృసమాను లగు వీరలమాట నే నెట్లు జవదాఁటుదు? (ప్రకాశముగా) బాబయ్యా! నిజముగ గురువులయెడ నపరాధినే యగుదును, కాని మీవాక్యములచేఁ గృతార్థుఁడ నైతి. (అని కేల్మోడ్చి).

న. గురునకు బాధ చేసి రను కోప[illegible] దేహ మదెల్ల నిండి దు
ర్భర మయి యుంట నిప్డు గురుభావము, పెద్దల టన్న బత్తి, నే
నరయకయుంట, నిట్లవినయంబునకుం గుఱియైతిఁ గాన సా
దరమునఁ గాంచి నాయెడను దప్పుల మన్నన చేసి పుచ్చరే?

సా——కుమారా! నీతుందుడుకింత మరల్ప నట్లుంటేఁగాని, గురుప్రీతికై ప్రజాసాక్ష్యార్థమై ప్రాణముల నాసింపక విజయివై యలరునీయెడ దోష మెంచుదుమా? అయినను గురువాక్యజనితామర్షావేశంబున క్షాత్రధర్మేతరముగ వీరల వధించి యప్పాప మందుదేమో యనుభయమున నట్లనవలసె, నీకుమాత్రము చెప్పవలెనా? ఇంతకు నీవు చెప్పిన ట్లాకోపావేశ మట్లు ప్రేరణ చేసినది.

ప——కుమారా! నిన్నెవ రిట్లు పురికొల్పిరి? నేఁ జెప్పుట లేదే?

ప్రభా—గురూత్తమా! మొన్నటిదినము నామేడపైఁ బారములఁ జదువుకొను చుండఁ గృష్ణాకుమారి తనచెలి యగుభానుశాంగిచే నీపితముగ వ్రాసి లేఖ నంపినది చూచుకొనుఁడు (అనిగురువున కందిచ్చును)

గు—అయ్యా! చదువుఁడు (అనిసౌమ్యసింగున కిచ్చును)

సౌ—(లేఖ విప్పి చదువుట నభినయించును)

శా. బావా! శాత్రవరాజదుర్గహనదావా! మ్లేచ్ఛు లిప్పట్ల నే
దేవం గాంచిరొ చూచితే? వెడగువారేటిల్లంగనే చేయఁగా
లేవా? లేవ ధరాతలిం జనులఁ బాలింపంగ మార్గంబు? లే
త్రోవం బోయిన మంచియో కనుట లేదో? చూడఁగాఁ బాడిగా

ఉ. బూటుముగ వహించి కడు బోటులజుట్లులఁబట్టియీడ్చుచున్
టోటులు మస్తకంబులను డొల్లగ నేయుచు, బల్మిఁబట్టుచున్
నోట ని కుమ్ముచుండిరి వినోదము లివ్వె యటంచు;నిండ్లలోఁ
బాటిలు విత్తజాతము నవార్యత ముచ్చిలి పొంగి రింగుసన్.

ఉ. హీనులు, పాపకర్ములు విహీనసదాచరణావిలాత్ములుం
గాన నొకించుకైన ననుకంపను జేకొన రందుచే సురా
పానవిమత్తచిత్తు లగుపందలతో నని సేయ నెల్లరున్
మానుదు రందు కేగద! యనాడికి వచ్చెను రాష్ట్రమంతయున్.

ఉ. ఏలవృథాగసాయపడకే యని తండ్రి ప్రమత్తులౌ మరా
టీలను గోరఁగావలెఁ? గడిందివెసం జనుదెంచి గుంపులై
లిలను బెచ్చురేఁగి, రవ లీలను దోఁచిరి దేశమెల్ల; నీ
లీలను జేయుచుండిరి భ తీ! యిఁకవారలదోస మున్నదే?.

ఉ. ఆయము తక్కి వారల సహాయము గోరుట నాలుగై దుప
ర్యాయము లేనిదోఁచుకొని రామెనుదేశము, రాజ్యమాబుణం
బాయెను, పీన్గుపెంట లయి రాయెఁ బ్రజ; ల్గనునంతశక్తి లే
దాయెను నీదుమామ, కిఁక నాయన నే యన నాయ మానటే?

సీ. హోల్కారు సింధ్యాయు । నల్కత్తోఁ బోరాడి
తేని సే నని చెల । రేఁగి రేఁగి
విజయ మందినవాఁడు । విఱ్ఱవీఁగుచు మన
వీటిపైఁ బడి తన । ధాటి సూపి
కప్పంబు నిమ్మని కసరి । కోటను జేటఁ
గలవు సైపూసల । నులిమి, బలిమిఁ
గొని యంతతోఁ దృప్తి । గొనలేక, జని దేశ
మునఁ దమక్రౌర్యంబు । ముంప నెంచి
గీ. బాలపాపలఁ బట్టి "నా । బాబుకాన!
నన్ను వీడుము, చూడు నా । యన్నకాన!"
యంచుఁ దలిదండ్రులకుఁ బొంతఁ । బొంచియున్నఁ
గనికరమ్మును గాంచిరే? । కని కరమ్ము.

ఉ. వారలపోరులోఁ దుది ని । వారితుఁడై యలరారెఁ గాదె! హోల్
కారు, మఱొక్కఁడాపదవి । గాంచి మతేమిటి తిన్నపెట్టె? చి
త్తూరును జెందఁడే! మనకు । ధూర్తులరాజ్యముఁ జూడఁడంచుఁ దా
వారికులస్థులం దవిలి । బాములసీమలు సూపుచుండరే?

ఉ. ఊరక యుండలేక మన । యూరు స్వతంత్రపు రాజ్య మంచు న
వ్వారు తదీయసైన్యము ల । వార్యత నిచ్చట నిల్పి వారియా
హారపుఁగర్చు లీవిత మ । హా! మన నెత్తిన పుల్మ లేదె? యే
దారిని జూచికొన్నను ము । దంబను మాట యొకింత యున్నదే?

చ. మనగురు ధీరు నాయను ప । మానగుణోత్తరు బల్మిఁ బట్టి యే
యనువున నీనరాధము ల । నాదరణం బొనరించి తన్నిరో?
వినవుకదా! యిఁకేటికి వి । వేకము లావుచలంపుఁ బెంపు, దెం
పనయముఁ జెప్పఁగాఁ దగని । యాగడముల్ పరఁగం జెలంగఁగన్.

చ. మనఘనపుణ్యకర్మలప । మాత్రముచేతను గాదె యాన రా
శనులకుఁ జిక్కితక్కె? నని । శంబును గ్రుమ్మరి దేశమెల్ల నా

శనము నొనర్ప వారలపశ మ్మయి మిన్నకయుండ, నంత నే
మనకటు మిన్నకుందురె? యహా!నుఋమాంఃరెయున్న వారలన్.

ఉ. కాన జనమ్ము సూపుటకుఁ గా నని సేయుదొ? మిన్నకుండుదో?
మానముఁ బూని కేసరిసమానముగా నిలువెల్లఁ జీల్చి సం
మానముఁగాంచెదొ?కట!యమాయికవృత్తిని దాల్చెదో?యిదే
గా! నవకీర్తికై తటి జగాన సుగానధురీణతం గనన్.

ఉ. పేరును బెంపు నొందుటకుఁ బెట్టినపేరుగదా కులంబు, నీ
కోరిక దీర యుద్ధ మిదిగో గన సిద్ధము, శౌర్య మన్న నా
దారికి నాటపట్టవు గదా? జయ మొందుట సిద్ధ, మింక నీ
బీరము సూపుచోఁ గడు కవిశ్రుతకీర్తిని జెందు టుండెఁగా.

(కృష్ణాకుమారి(వాలు అని)

హా! తల్లీ! ఇట్టి శౌర్యధైర్యాదిగుణములు గలనీవైన నూకులమున మొగపురు
గవై పుట్టరాదా? అట్లైన నీప్రజ లిట్టిబాధలు పడనోపుదురా? ఈయుదయపుర
మున కిట్టిదశ లబ్బునా? కుక్కడు నేయి యెట్లబ్బు?

గు—హా! పరమపావనీ! నీకు విద్దె గఊపుకతంబున నాజన్మము కృతార్థత
వహించె.

ప్రభా—బాబయ్యా! ఇట్టివాక్కులు వినఁ బాషాణములైనఁ బరువు లిడకుండునా?

భీ—సర్వము వారియధీనమై యుండుపట్ల నెందుల కీపౌరుషము?

(తెరలో వైతాళికుఁడు)

చ. అదె! రవి పశ్చిమాద్రిగహనాంతరసీమఁ జరింపఁజొచ్చె మే
లౌదవ నతం డొనర్చుపనియోపిక వేగమ తీర్చి యీయెడన్
సొద నొకదానిఁ బెట్టుకొనిసొక్కుచు సోలుచు నెవ్వ రుందు;రీ
పదిలము కొల్వు మాని నరపాలక! యాహ్నికముం బొనర్పవే.

భీ—ఆచార్యా! సాయాహ్నికకృత్యముల నిర్వర్తించు కొందమా? (అని సరదారుల
వైపుఁ దిరిగి) ఈదురాత్ముల మంత్రికడకుఁ దీసికొనిపొండు.

(ఇల్లెల్లరు హజారము విడువ బైట)

సౌ—ఆచార్యా! అదె! అంశుమాలిమందేహాసురకీలితాంగుం డై వారాశిం జలకం బాడఁ బోవుతఱి నాడిక్కీమంతినీమణు లెల్ల బద్ధానురాగ లై శుకపికబాలికాజాలకాకలస్వనముల నెపంబున నుల్లసమాడుచుండెనో యనురీతి హృదయోల్లాసమునకు హేతువు లై యుండి.

సీ. చరమదిక్సతి మిట్ట చన్నులఁ గప్పుహా
రంగుమీఱిన చీర రంగు లనఁగ
బచ్చవిల్తుని పైకి ఫాలాక్షుఁడిడునట్టి
మింటి నంటిన మేటి మంట లనఁగ
బడబాగ్ని కడలిలోపలి నుండి పైకేఁగి
కలియుగాంతమ? యంచుఁ గాంచె ననఁగ
సంజ క్రొన్నన బోఁడి సంతసంబున నుండు
కెంపురాజిగితిన్నె గుంపు లనఁగ

గీ. ద్విజభటారావకలకలద్వేలదృప్య
దతనువిజయోత్సవారంభమునందు ముందు
పట్టుమేల్కట్టు సొంపునఁ గట్టి రనఁగ
సంజకెంజాయ లలరె దిక్చక్రమందు.

గు—కాని యిటు చూచితిరా?

గీ. తపనుఁ డనుగుండు మిక్కిలి తప్తపఱిచి
యసితమేఘాఘతూలంబునందు నుంచఁ
గ్రమమునను మండుకొనిపోవు కరణి ధరణి
సంతసం బొప్ప సంజకెంజాయ లలరె.

ప్రభా—గురువరా! ఈస్థితిని బాగుగ యోచింపఁ దగియున్నదిసుఁడీ? అదె!

గీ. కాల మనియెడునొక్క కంసాలివాఁడు
సంజ యనుకన్నె దరి నుండి సరకులకును
వేయుబంగారు కరఁగి తాఁ బిదప నీటి
లోనకుం దీయురీతిని భానుఁ డొప్పె.

గు——నృపతివర్యా! అనుష్ఠానమునకు సెల వొసంగెదరుగాక.

భీ——చిత్తము; మీ రేఁగవచ్చును, (అని) ప్రతీహారీ!

(అంత బ్రతీహారి ప్రవేశించి) దేవా! వేచియున్నాఁడ

భీ——భోజనాగారమునకుఁ ద్రోవ నూపుము.

ప్ర——చిత్తము, దేవా! ఇటుదయ సేయుఁ డిటు.

సౌ——బావా! నేఁ బోయి వచ్చెద.

భీ——మంచిది, రాత్రి మరలఁ గలిసెదముగాక. (అని ప్రభాసింగుచేయి పట్టుకొని) బాబూ! భోజనమునకుఁ బోవుదము రమ్ము.

(ఇక్కెల్లరు నిష్క్రమింతురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీరస్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## ద్వితీయాంకము.

రంగము సింధ్యాదర్బారు.

[మంత్రిసమేతుఁడై సింధ్యా ప్రవేశించును]

సిం——(క్రిపితో)

ఉ. మానితదుర్మదాఢ్యరిపుమండలకుంభికఠోరకుంభహం
త్రీనిశితాసివల్లి కిఁకఁ దీవ్రత కేమియు వ్రత్తి లేదుగా?
పూనికతోడ నింక మనప్రోలికిఁ బైఁబడి రాఁ బ్రయాణమై
రేనియుఁ దెల్పు వారల నిదే! తెగటార్చెద మంత్రిసత్తమా

మం——మహారాజా! అనన్యావాప్తపరాక్రమభూజా!

మ. పసులం బట్టి పలాద్భురీతి నతికోపం బుప్పతిల్లంగ నా
రసపుత్త్రిప్రకరంబు నుగ్గడఁచి, తీవ్రప్రాభవం బొప్పుహా
రసునిం జెండితి; వింక నీయెడను సంరంభంబుతోఁ బోరుమా
నిసియా లేఁడు, గనంగ రాజ్య మనఘానిష్కంటకంబయ్యెఁగా.

రాజోత్తమా! ఉదయపురమంతయు నిర్బాధకముగ స్వతంత్రము చేసికొని సైన్యములచేతను, మంత్రులచేతను బంధించితిమికదా! ఇఁక మారువారుసంస్థానాధిపతి యగుమానసింగుగూడ మనల నెదిరింపఁజాలఁడు. అట్లు తలపెట్టుకొనఁడు. ఇంక నాయంబరుసంస్థానాధిపతి యగుజగత్సింగుమాత్రము మనకుఁ బ్రతికక్షులోఁ జేరిన వాఁడు యోజింప నాయనపెక్కుమాయలు తంత్రములు నేర్చినకుటిలుఁడు, గాన మన కసాధ్యునివలెఁ గన్పట్టుఁ; గాని మనపై దండెత్త నతనితరు యెంతమాత్రమును గా నూపదు.

సిం—ఆదరాత్ముఁడేమియుఁ జేయలేనిమాట సత్యమే, యైనను హాని నెట్టులనైన నణఁగఁద్రొక్కు నుపాయములు మాత్రము చింతింపవలసియే యుండును.

మం—చిత్త, మాలాగునసే. దీని కొకలాగున నైన బాగుండు నని నాయూహ.

సిం—చెప్పు మది యెట్లు?

మం—మతియేమియును గాదు; మానసింగునకును, మనకును, సఖ్యము పొసఁగె నేని వానిగర్వ మణఁగకమానదు.

సిం—అది యెట్లు పొసఁగును?

మం—అట్లొట కేమియు సందియము లేదు, ఏల యన. ఆయనయే యిందులకు యత్నించుచున్నవాఁడఁట.

సిం—అట్లైన మనకుఁ గావలసిన దేమి? తప్పక సమ్మతింతము.

(అంతఁ బ్రతీహారి ప్రవేశించి) దేవా! దేవరనుదర్శింప ద్వారమున నొకభూసురుఁడు నిరీక్షించియున్నవాఁడు.

సిం—పొమ్ము, తోడి తెమ్ము.

ప్ర—చిత్తము దేవా! (అని వెడలి వానితోఁ బ్రవేశించును)(ఎల్లరునిలుచుండుదురు).

భూ—(సింధ్యానుద్దేశించి కరమెత్తి)

మ. చిరజాగ్రత్స్వపమాఖ్యకౌస్తుభమణిశ్రీవత్సనిక్షిప్త యై
వఱలన్ లచ్చి, ధరిత్రి, నిలయు రహిం బార్శ్వంబులం దొప్ప నా
తురతన్ సందిటఁ జేర్చి పాల్కడలిలోఁ బదూఁగాడుచున్నట్టియా
హరి నిన్నోమ్ముత శోషితారికుల! సింధ్యామేదినీవల్లభా!

సిం—ధన్యోస్మి. ధన్యోస్మి. ఎవరురా! ఆసనము.

(ప్రతీహారి యాసన మిడ భూసురుఁడు, రాజు మొదలగువారితో నధిష్ఠించి)

రాజేంద్రా! కొను మిదె దైవప్రసాదము. (అని యొకఫలమును రాజున కిచ్చును)

సిం—(కండ్ల నద్దుకొనును)

భూ—రాజేంద్రా!

ఉ. లేవుగదా యరిష్టములు? లేదు కదా యడుగంటియుంట మీ
లా? వికశత్రుఁ దోలఁగఁ గలాఁడవు గా? యితరేతరంబు మీ
లో వలనొప్పి సఖ్యము బులో మని యుండుదురే కదా? యివే
లా? వశులైన రాజులు గులాములుగాఁ జరియింతురే కదా?

సిం—అయ్యా!

మ. భవదాశీర్వచనప్రభావమున సంగ్రామాన్యుండ నే నైతి; నా
దవురాజ్యంబునఁ గష్టములు గలుగ; వారియాశత్రురాట్పాళి యా
హవమన్నన్ భయ మొందు; మాకిఁకఁ గొఱంత లేదు మాయుచ్చ తేఁ
కువతోఁ గోరెదఁ జిక్కు రాజులు సుమా! శ్రీగోత్రామరోత్తంసమా.

భూ—మహీపాలా! అసమానప్రజ్ఞాధురంధరు లగువారికడ వెత్తి యనుశబ్ద మెట్లుండును?

సిం—పుడమివేల్పా! మీవంటి మహనీయులయాశీఃప్రభావ మున్నచో వెత్తి మాకేల? కాని ద్విజాగ్రగణ్యా!

ఉ. ఏకడ నుండువార? లిఁక నేకడ కేఁగఁ దలంచినారలో?
మాకడ కేఁగుదేర నభిమానముఁ జెందు టదెందుకో కదా?
మీకడ సర్వశక్తులు సమీహితవృత్తిని నుంట నెప్పటన్
లేకయె మీముఖంబిఁ కవకేలిలను దెల్పుము భూసురోత్తమా!

భూ—రాజచంద్రమా! వినుము, నాయుదంతంబెల్ల శ్రుతపతికేడ. నన్ను "కలాచలభట్టు" అనియెదరు.

ఆ. మారువారు మాది మానసింగను తేఁడు
మనవి సేయు మంచు మాట చెప్పె
మేటినదుల వనుల దాఁటి యిందుల కేను
చూడ నిప్పు వచ్చినాఁడ మిమ్ము.

సిం—(తనలో) అది యేమిటో కదా? మన మనుకొనినదే కావచ్చును. ఎందుల కీసందియము? తేటపడకుండునా యేమి? (ప్రకాశము) మానసింగా? అది యెట్లు?

భూ—"సాభిప్రాయసూచకముగా విధేయుఁడవై యిట్లని చెప్పు" మనియె.

ఉ. బాయనిమైత్రి గల్గి చిరసాయముగా మన మింతదాఁక నో
హో! యన మేరమీఱెడు సహోదరవృత్తినిఁ జెంద నేమియుం
జేయఁగ లేరు శత్రులు; నశించక మానరు వారు; మీయభి
ప్రాయమిఁ కెట్టులో కదయ సాయము నారయుమయ్య! భూవరా!

సిం—వింటివా! సచివోత్తమా!

మం—ఆయన మాత్రము సామాన్యుఁడా యేమి? అదియునుంగాక దేవరతో నెయ్యముఁగాక కయ్యము నేరకోర నెంతురు?

సిం—కయ్యము నూని ధనప్రాణములు కోల్పోయి దేశముల నుహోత్క్షోభను నెల కొల్పుట మాకుమాత్ర మిష్టమా?

భూ—దేవా! ముఖ్యముగ మనముఁ బాటించెదరు గాక యని యారీతిఁ గూడ నుడివిరి.

సిం—అదియెట్లు?

భూ—అయ్యా! వినుండు:—

ఉ. "తుందిల మైనమాబలము తో వెడలన్ రిపురాజి భీతి మా
ముందట నిల్చునే? బలసముద్ధతి నూపను దీవ్రకోపులై
క్రందు కొనంగ నెవ్వఁడు మ రాటుల బారికి నిల్వ నోపు? వే
యొందుకు శత్రుపాళి మన మేకము గా మనమేఁక లే కదే."

మం—బాగుగనే యున్నది. దేవర యంగీకరింపవచ్చుననియే నామతమును.

భూ—రాజేంద్రా! వింటిరికదా? ఇఁక మీయభిప్రాయముఁ గూడ వేగమె తెలిపినచో మాఱేఁడు సంతసించును, నన్నుఁగూడ వేగమె రమ్మని నియోగించిరి.

సిం—భూసురవర్యా! అన్యోన్యస్పర్ధల నూని ప్రజల నాశము సేయ నేమి భాగ్యము? కావున;

గీ. "మేలు! నీబుద్ధి నీయుక్తి జాల" మనుము
చాలు! నీశక్తి మాతోడఁ జాలు ననుము
తలఁచె నీతోడ మైత్రి సింహధ్యాన్నపాలుఁ
డనుము; నీతేఁకువకు మెచ్చెననుము; సనుము.

(అంతఁ బ్రతీహారి ప్రవేశించి)

దేవా! ఉదయపురమును జూడ నియమించిన మంత్రివరుఁ డగుదేవాజీకడ నుండి భటుఁడెవ్వఁడో వచ్చి దేవరను దర్శింప ద్వారమున వేచియున్న వాఁడు కార్యము నే నడుగఁ జెప్ప ననె.

సి—వేగము తీసికొని రమ్ము.

ప్ర—(చిత్త మని నిష్క్రమించి వానితోఁ బ్రవేశించి రాజానకు నమస్కరింతురు)

సిం—(తనలో) ఓహో! ఏమిదీ! వీనియాకారము? ఈ జీయేరును దొలవక లేదాయేమి;

యీమూర్ఖు నంపినాఁడు? (ప్రకాశముగా) ప్రతిహారీ! వీనినామ మేమియో? యడుగుము.

ప్ర—ఓయీ! ఉదయపురవాసీ! నీనామ మేమియో? దేవరకు విన్నవించికొనుము.

భటు—ప్రభులోఁడం తేను నాకింత గుంతా; దండునేత మీరే సెప్పాలి, మీకు నే సెప్పి స్కుంతాను బాభో!

సిం—(నవ్వుచు) మంత్రివరా! ఏమిదీ! వీని వాగ్ధోరణి? యనుపమానముగ నున్నదే?

మం—వీరే ద్విపాదపశువులు దేవా! ఇట్టి మూర్ఖులు, గావుననే దుమ్ములు పేలఁ గప్పించుటయే కాని మాటల నెఱుఁగరు.

ప్ర—అదేమియో నాకే చెప్పుము.

భ—బాభో! నాపేరు దీరగజం ఘుంతారు, ప్రభువులోరు మాయూళ్లో నుంచి నదే వాజిమంత్రులోఁడు సంపినాఁడు బాభియ్యా!

సిం—ఏమిదీ! మంత్రి చంపుట యేమిరా? మూర్ఖా! (అని) ప్రతీహారీ! తర్కింపుము.

ప్ర—ఓరీ! మూర్ఖా! ఎవరిని జంపిరి? నిజమేనా?

దీర్ఘజంఘు—నిజమేను బాభో! సంపినాఁడు. “నిజమేనా?,, యంతారేటి? తండ్రీ! ఉద్దపుర మంతా గోలేనుకదండీ! మాకుమంచోఁడు దాపరగించినాఁడు; ఏటి బాభో! అంత చదు నైనోణ్ణిప్పించినారు? ఎంత చదు నైనోఁడు?

సిం—సచివోత్తమా! వింటివా? దేవాజి యెర్నైనఁ జంపించెనా యేమి?

మం—ఈమూర్ఖుఁడు ఆయనకడనుండియే వచ్చెనఁట. ఇఁక వీనిమాటయందుండు సారమును గ్రహించుకొనుఁడు.

ప్ర—నిన్నెవ రంపిరిరా? మూర్ఖా!

ధీర్ఘ—ఒక్కసిటం మాటాడించకు నాబాభియ్యో! కాఁళ్లు రాలు ఠీకెత్తున్నాయి. సోరెండిపోనాఁది. సల్దంజేనా నేదు భాభో! వోరోజా? రొండ్రోజులా? వోరంరోజు లొక్కనాఁగ సావుభయఁగుతో నొచ్చినాను తండ్రో! సూడండి నాబాభో? సెవఁ టోసిపోనాను. సిత్తగించండి! గుండెలేనాఁగ కొట్టుకొంతన్నావో?

సిం—(నవ్వుచు) ఏమిదీ? మంత్రివరా! ఇదియొక క్రొత్తభాషవలె నున్నదే? ఈభాష యభ్యసించినను గూడ నలువడునా?

మం—ప్రభువరా! పండితులవాక్కులు వీరికెట్లు క్రొత్తలో, వీరిమాటలు వారికిని గ్రొత్తలై యొప్పుచుండు. ఇందు సకలజనులయొక్క యా యా యవస్థ

లయం దైనమనోల్లాసముల గ్రహింపఁ దగుప్రాజ్ఞులు, వానినెల్ల వ్యక్తీకరించుటకై తదుచితచమత్కార భావార్థగంభీరసాలవాలము లగుపదములఁ గల్పించుకొనిరి. కుక్షింభరు లగువీరికి వానితోఁ బ్రసక్తియే లేదు. కావున ఉదరపోషణార్థముగా వ్యవహరించెదరు వ్యవహారమునకుఁ దగుపదములతోనే తృప్తి వడయుచు, "తదభివృద్ధివలన ననేకులహృదయధర్మములను, మర్మములను, దెలిసికొనవచ్చు" ననెడి జ్ఞానముకూడ లేదు.

ప్ర—ఓరీ! పిచ్చివాఁడా! ఏమంత యగత్యము మూడినది? ఎందుల కట్లు రావలెను? చంపుటయేమి? శీఘ్రముగ చెప్పుము.

దీర్ఘ—(ఉస్సురని) నోట్లో తడేనా, నేడు తండ్రో నిబ్బంగ సంపినాఁడు బాభియ్యా! మీపాదాలుతోడు, "సంపినా,, డంతారేటి?

ప్ర—ఓరీ! చండాలుఁడా! ఎవరినో వినిపింపుము, బుద్ధి చెప్పవలెనా యేమి?

దీర్ఘ—"వొవు ర్నంతారేటి? సంపటం వోనాఁగా? నన్నేను భాభో! సంపినాఁడు.

(ఎల్లరు నవ్వుదురు)

సిం—మంత్రివరా! వీనిని జంపుట యేమి?

మం—నరనాథా! ఈబానిస పంపుటకే చంపెననుచున్నాఁడు. అనఁగా "ఇదిపంపుట కాదు చంపుటయే సుడీ!,, యనుట.

ప్ర—ఓరీ! చచ్చి భూతమవైతివా? యేమి? అది యేమియో వేగము చెప్పుము. (అని జుట్టు పట్టుకొని యూఁపును)

దీర్ఘ—సచ్చినాను భాభో! పిల కొగ్గిపెట్టు నాతండ్రో! యినామిప్పించు మని నేర కడిగేను తండ్రీ. అందుకోసరమే ఆప్రభు వేటోగాని యీకాయిత మిచ్చి పొమ్మంటే, ఈనాఁగ ఒంటికేనా కూకోకుంటూ దిగపడినోణ్ణి, పిల కొగ్గిపెట్టు భాభో!

ప్ర—(జుట్టు విడుచును)

సిం—ప్రతీహారీ! ఏమియో కాకిత మట. పుచ్చుకొనుము. ఈమూర్ఖునితోఁ బ్రసంగమేలా?

ప్ర—ఓరీ! మూర్ఖా! ఏమియో యిటు తెమ్ము,

దీర్ఘ—(చంకనుండి గుడ్డ చుట్టియున్న కాకితమ్మును దీసి యందిచ్చుచు) మంచియినాయి మిప్పించాలి నాబాభో!

సిం—ఓరీ! నీయినాము కాల, ప్రాణములు పుచ్చుకొంటివిరా! ప్రతీహారీ? ఏమియో విప్పుము.

ప్ర—(విప్పి) దేవా! ఇదేదియో పటమువలెఁ గాన్పించుచున్నది (అని రాజున కందిచ్చును.

సిం—(అందుకొని) ఓహో! మంత్రివరా! చూచితివా? ఈయాకృతి విశేష మెయ్యది యై యుండనోపు? (నిలువంబడి పటముం జూచుచు)

సీ. ముక్కంటిచే స్రుక్కి పూవిల్తుఁ డొనగూర్పు
కొనుమేటిసింగిణికోల యేమొ?
ఖచరమర్త్యాంగనాగర్వనిర్వాపణా
ర్థము విధాత యొనర్చు తరుణి యేమొ?
మోహాధిగతజగన్మోహావతారుఁడై
పంకజాక్షుఁడు భూమి వడసె నేమొ?
భారతీస్మరసతీభామామణులకాంతి
ముచ్చిలి ప్రోవిడు ముత్తమే మొ?
గీ. శ్రితమహాఘోరభైరవీమృత్యు మర్త్య
మత్తకాశిని క్రీప్రభామహిమ మెట్లు?
తారుమా రొందె తా నిట్టి తరుణిఁ జేయ
ధాత యాతనితాతను దలఁచకున్నె?

సీ. క్రౌర్యలోకజిగీషుకైరవేషునియాశు
గముల కీననఁబోఁడికనులు గనులు
తాపసేంద్రాదిహృద్గ్రంథిబీఁటలు పుచ్చఁ
జాలు నీయింతిమేల్చనులకొనలు
స్మేరావలేపానుసారి యై రేఖేనిఁ
బొడువ నోపును దీనిమోముగోము
వేణీప్రసూనాస్త్రతూణీర మనునట్టు
లొప్పారు నీయింతికప్పుకొప్పు

గీ. నెలఁత కీవాట మెన్న వెన్నెలల తేట
చాలుఁ! గుందము లీపలుఁ జాలుఁ డాలు
నదమె నుడి యాఁ జరత్కోకనదము పదము
గాన నీరీతి చాన జగానఁ గాన.

మం—(చూచి) మహారాజ! ఈచిత్తరువును లిఖించినవా రెవ్వరో కాని; వారిని ముఖ్యముగఁ గొనియాడఁదగినది ఏలయన; నీలలన ధరించు జాళువా వలువయంచున నీపె నామధేయము నెంతయుం జక్కఁగ లిఖించినాఁడు; చూడుఁడదె! 'కృష్ణాకుమారి' యని కాన్పించుచున్నయది.

సిం—ఔ, నదె; కాంచితి; నాహా!! ఈమెయా కృష్ణాకుమారి? వినుటయే కాని, కనుట నాకేకాదు మఱియేరికిని సంప్రాప్తము గా లేదు. (అనికండ్ల నద్దికొని)

మ. అవురా! వన్నె పసిండిబొమ్మ యిది? మేలౌరా! చొకాటంపు గ్రొం
జివురా వాతెర? బెళ్కు బేడిస లురా! చింతింపఁ గందోయి? తే
నవురా! మోమున నోమియున్నదె? జగన్మాన్యాకృతిం దాల్చు తే
జవరాం డ్రైనను దీనిగోటిసరి రాఁ జాలంగ లేరెమ్మియున్.

భూసురుఁడు—(లేచి) మహారాజ! సెల వొసంగుఁడు పోయి వచ్చెద.

సిం—భూసురోత్తమా! మీ రేనాఁడైన నుదయపురమున కేఁగి యుంటిరా? ఏలయన; మీ కేయంతఃపురముల నేయాటంక ముండదు గావున నీయమ్మలాఁడినిఁ జూచియుందురేమో? యని యడుగుటకు.

భూ—రాజేంద్రా! వినుఁడాయుదంతంబెల్ల విస్తరించెద.

గీ. చూచినాఁడను నే నామెఁ జూచినాఁడ
నామెవిద్యాప్రభావంబు నామెసొబగు
నడుగ నేటికిఁ? జెప్పెద నహహా! రాజ!
యుదయపురమునఁ దొల్లి నే నుదయమైతి.

సిం—తొల్లి మీది యుదయపురమా? అది యెట్లు?

భూ—గీ. నాదుతండ్రులుఁ దాతల సాదరమునఁ
జూచుచుండెడు నచ్చటి రాచవార;

లంతకంతకు వారలు తైన్య మొంద
మారువారుకుం జోరి నుదాగచరిత!

సిం—అట్లైనం దప్పక చూచియే యుందురు. ఈశతలోదరి పటమునం దున్నయట్టు లనే యుండునా? చిత్రకారుల ప్రజ్ఞావిశేషమా?

భూ—మహీపాలా! ఏ దాచిత్తరువు? (అని పుచ్చుకొని చూచి మరలరాజున కిచ్చి) ఇది వ్రాసినవా రెవ్వరో కాని యంత శ్లాఘనీయులు కారు; ఏమన.—
ఆలలనచెల్వము గోరంతయైన వ్రాయుట లేదు.

సిం—అట్లైన నింత కెక్కుడుగ నుండునా?

భూ—అట్లన నేలా? ఆమెను నిర్వచింప నేరికి శక్య మౌను? అయిన నా నేర్చిన
యట్లు వక్కాణించెద; వినుండు.

సిం—సెలవిండు. సావధానుండ నైతి.

భూ—రాజేంద్రా!

సీ. గాడంపుమోవిజిగాడంపుఁగెంపుల
జిగిఁ గాంచి వగఁ దూల నగుచునుండు
వరసముత్తుంగపీవరపయోధరములు
జక్కవకవఁ ద్రొక్కి నిక్కుచుండు
సొలపుచూపుపిసాళిబెళుకువాల్గన్ను లిం
దిందిరమ్ముల వినిందింపుచుండుఁ
గటి యన్నిటికిని యొక్కటియ హరిహరి
రిక్కదారిని బట్టి డొక్కసీల్పుఁ

గీ. గరము కంజంబు, జంఘ మకరము, దరము
గళము, పులినంబుఁ బిఱుఁదు, వి గళన మొందఁ
దీర్ఘములఁ ద్రోయ మునుఁగుచుఁ దేలుచుండెఁ
గాదె! యానాతి కెన చెప్ప లేదు కాదె?

సిం—మహీసురోత్తమా! అట్టి సౌందర్యవతి గాంచున్నచో నింతమానసోల్లాసపూర్వక
ముగ వర్ణించుట జరుగఁగలదా?

భూ—రాజోత్తమా! కోటిమాట లాడుటయేకాని,యాబోటిగోటినీటులైనఁ జాటలే
రనుకొనుఁడు,

చ. వనిత సళాకు, మేనుచలువమ్మునఁ గ్రొన్ననతీరుఁ గేలు, మే
లనుపమితోరకొప్పు జలదాళికిఁ దాపలి దారిఁ జూపు, మేల్
గొనబుకడానిగబ్బిచనుగుట్టలు దిట్టలఁ బట్టిగుట్టు నీ
ధిని బడవైచుఁగా! యనుగతింప, నతింగొను నెల్లవస్తువుల్.

సిం—అట్లైన నీవ్వగరాజమధ్య, కీమెయుఁగుబోఁడి కా రంభాద్యప్సరోగణములలోని వారేసరి యగుదురు గాఁబోలు?

భూ—రాజేంద్రా! అవి యేటిమాటలు?

క. ఆసతినసుమునకా! సరి
కేసరి? నును మేనుకవికకిం జిత్తరుసం
చా! సరి? చేసరి కజ్జము
లా! సరి? లే సరి నెలంత లాసఖిసరియే?

సిం—అహా! పుడమివేల్పా! నిజ; మీయన్నులమిన్న కే కన్నె సరియున్నఁబడనోపు? (అనిపటముం జూచుచు) అయ్యారే! యొయ్యారి! వియ్య మొందనినీయొయ్యారము నిరాబాయ లగుజడదారులనెయ్యంపుఁ బ్రోమలకుఁ గూడఁ దియ్యనై చయ్యన మొల్కల నొత్తింపకున్నే? (అని మంత్రివైపుఁ దిరిగి) అమాత్యోత్తమా!

ఉ. ఏటికి నవ్యభూషణము? లేటికి మేటిపసిండికోట? లిం
కేటికి రాజ్యసంపద? లిఁకేటికి నీజగమెల్ల నబ్బను
బ్బేటికి? మేటిచెల్వ మిఁక నేటికిఁ? జుట్టలుమిత్రు లింక; నీ
బోటిని గూడుసౌఖ్య మొకపూఁటయ చాలదె? స్వర్గ మేటికిన్.

మం—పుడమిఱా! మీరుకూడ వాపోయ నేలా?

శా. పారావారగభీరశక్తిగతసంపత్ప్రాభవానూను తా
మీరల్గోరని దెంతమాత్రము? నృపా! మీరూపముంజూడనే
నారీరత్నము చిత్తజాస్త్రపటలోన్మాదంబునుం జెందఁబో?
దేరీ! మీరలు కోరనీయ మనువారీధాత్రిలో భూవరా!

సిం—విను మొకదాని కిట్లంటి.

గీ. మన కిదంతయు సిద్ధమమాత్యవర్య!
రాజపుత్రులకు న్మహారాష్ట్రులకును
గాంచ సంబంధములు లేవుగా! యనియెదు
కొంకుఁ జెందరె? వార లీవంకఁ జూడ

మం—అమ్యో! నృపవరేణ్యా! అట్లనెద రేలా?

ఉ. మత్తు సిరస్సు కెక్కఁ బలుమారలు మ్లేచ్ఛులు నల్లమందు మ
ద్యత్తులుఁ గల్లుమాంసములు ద్రావి శరీర మెఱుంగకుంట రా
జోత్తము లైనవీర లది యోజన చేసిరె? వీరి ప్రాయపుం
బిత్తరుల న్నరాధములఁ బిల్చుచు నీయరె? వారిఁ గొల్వరే?

భూ—(తనలో) ఆహా!! ఈపాపి యెంతటిమణిపూసవంటివంశమును దూఱుచున్నాఁడు? అదియునుంగాక నిష్కళంక మగు నుదయపురరాజులవంశమును దూఱినందుల కీపాపాత్ముని నాల్క తెగిపడనందుల కాభగవంతుని దిట్టఁదగియున్నది.

సిం—సెబాస్! బాగుగ నొడివితి. తురక లెందఱని బెండ్లియాడిరి కారు? మన పాప మేమి? కావునఁ దప్పక వెంటనే భీమసింగున కీవిషమై లేఖ నంపుము. ఆవలకతఁ జూచికొందము.

మం—ఇం దావలకథ కే మున్నది? మీవంటిరాజాధిరాజు లట్టివారికన్నెలఁ గోరు టెట్లు? వారల కింతకుఁ గావలసిన దేమి?

సిం—అందులకే తప్పక నీ వాపని మొదటఁ జల్పుము; ఈభూసురోత్తమునకు మాత్రము పండితసత్కారములు పూర్తిగఁ జేసి పంపుము. మే మిదె! లీలోద్యానవిహారము సేయ నేఁగెదము.

మం—చిత్త మట్లనే నిర్వర్తించువాఁడ.

భూ—రాజేంద్రా! సెలవు దయచేయుఁడు; నే నేఁగువాఁడ.

సిం—మీసత్కారములు వడసి మీ రేఁగవచ్చును.

దీర్ఘ—నాకేటిన్నీ యినాఁయి మిప్పించినారు కారు బాభిమాన్యా!

సిం—నీ వేమి కోరెదవురా?

దీర్ఘ—(తల గోకికొనుచు) ముసిలిముండ ధాకూతుఁరు బాభో! మీగులాపుదాయి.

సిం—అట్లైన మతియొక్కటె కావలెనా యేమి? (అని మంత్రివైపుఁ దిరిగి) పాప మీయన కట్లైన నొకపడచుకన్నెను గట్టిపెట్టవలెను జుమా!

మం—నే నొకకన్నెను జూచి యుంటి, నామెయైనచో నీయిరువుర కనుకూలదాంపత్యమై యుండ నోపు.

సిం—అబ్బా! ఈయనయీడునకు జోడయినకన్నె సృష్టి యయియే యున్నదా? ఏమాభగవద్విలాసము? అట్లైన నీయన కామె సొబగు స్పష్టపఱచి యైనఁ జెప్పుట విధాయక మేమో?

మం—(నవ్వుచు) ఓయీ! దీర్ఘజంఘీ! ఆమె నీరూపరేఖావిలాసములన్నిఁట ని న్మించియేయుండును. సంశయింప నక్కఱలేదు.

దీర్ఘ—సిత్తం భాభియ్యో! ఏటీ తేల్చినారుకారు.

సిం—(మందహాసముతో) ఆమాట యేమియుఁ దేల్చలే దఁట వివరణ చేయుము.

మం—(నవ్వుచు) అదియా కావలెను? కిరిమ్రాకువలె నీవు, తాళధ్వజమువలె నామెయు, జీడిగింజవలె నీవు, తారుబుఱికివలె నామె; నీకు దుక్కలవలెఁ గాళ్లు, ఆమెకు దూలములవలెఁ జేతులు, నీకుఁ జీపికండ్లు, ఆమెకుఁబుసికండ్లు, పెంకువలె నీవు, పేడతట్టవలె నామె, జడ్డి నీవు, జంక యామెకు, నీరీతి నన్నిగుణములచేత నామెయే హెచ్చుగుచుండుఁజుమా?

సిం—(నవ్వుచు) అట్లైన వీనికిఁ గట్టిపెట్టుట మానరాదు.

దీర్ఘ—బాభియ్యో! యినాయి మిప్పిస్తే సిప్పించండి, నేసుంతేను మానండికాని, గంజి నేక యీాతొత్తుకూఁతురుతోనే బరించనేక సత్తుంటేను, మహాక్కదాయిని కూడ కట్టి నాగొంతుకొక్కయ్యాలని సూడకు బాభో! (అని మ్రొక్కును)

సిం—(నవ్వుచు) మంత్రివరా! ఈయనను రేపుగూడ మావినోదార్థము రప్పింపుము. కొల్వుచాలించెద. నీపనులు దీర్చికొనుము. (అని గద్దియ డిగ్గి) ప్రతీహారీ! లీలోద్యానమునకు దారి సూపుము.

ప్ర—దేవా! ఇటు దయసేయుఁ డిటు దయసేయుఁడు.

(ఇట్లెల్లరు నిష్క్రమింతురు.) ఇది ద్వితీయాంకము.



శ్రీ ర స్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## తృతీయాంకము.

---

—◆◆◆ 1. రంగము ఉదయపురము-రాజదర్బారు. ◆◆◆—

[రాణాభీమసింగు, మంత్రి యగునజితసింగు, సౌమ్యసింగు ప్రవేశింతురు]

భీ—అమాత్యోత్తమా! సింధ్యాకు మనమంపినప్రత్యుత్తరము సహేతుకముగ నున్నట్లేకదా?

అజి—అందులకే యేమియు ననలేక యింతటిదాఁక మిన్నక యున్నవాఁడు.

భీ—ఆహా! ఏమీ! ఆయనదుర్నయము.

ఉ. పాయక కల్లుమాంసము లహారముగా నలనల్లమందు గం
జాయియుఁ గ్రోలి మత్తతఁగసాయిలు రాకాలమందుఁ బుట్టులే
ప్రాయఁపుఁ గన్నెలం దమయుపాయముచేతనో, బల్మిచేతనో,
డాయఁగ నైరిగాక; యకటా! యితఁ డట్టిఁడె? కోరవచ్చునే?

అ—ఆయుష్కరతురుష్కు లెచ్చట? ఉపాయములెచ్చట? కాన మనవారి స్త్రీల నపాయరూపముననే గాని, యుపాయరూపమునఁ గొని రనరాదు. ఇంతియ గాక రసపుత్త్రులు తుఱకాల మవశిష్టముండెనేనిఁ దొలుత స్త్రీల నఱునూడుకొని పిమ్మట నాకఱకు బానిసఁ జెండిచెండి రణభూములకుఁ బ్రాణము లర్పణము సేయుచు నుప్పరాజవరులు, ఈరీతి నీయకొని రనుట నేమిప్రాజ్ఞుఁ డని నొడువుదు? అయిన నేజాతియందైనఁ గొందఱు తుచ్ఛు లుండక పోరు, వారింబట్టి యెల్లర నిందింప న్యాయ మగునా?

భీ—ఆనుదోన్మత్తుఁ డెట్లింతవట్టు యోజించును? ఈభాగ్యమునకే పరుల నెంచవలెనా?

చ. అతనికులంబునం దుదయపురమందెముబోటులఁ గోర నన్యులే
హితముగఁ జేయునో కద? వివేకము లేదటె? రాజుకాఁడె? యా

గతి నెటనైన భూమి జరు§గం గని కూకలు వైచి మాన్చు బా
ధ్యత తనపైని లేదె? విన§యంబున నీయ న టంటినే గదే?

(అని భాష్పముల నొత్తికొని) మంత్రివరా!

గీ. పేరు బెంపును జెందిన § వారియొక్క-
కాలమునకు మచ్చ నే నెట్లు § గూర్తుఁ జెపుమ?
జాలి నొందక యూమరా§టీల కిచ్చి
కూఁతుకుత్తుక గోయుట § గూడుఁ జెపుమ?

కావున నిందు శుభం బగుతెఱం గెఱింగింపుము.

అ-చ. తెలుప నిఁ కేల? భూప! భవ§దీయకులాగత మెంచినాఁడ నీ
తులువలతోడ మైత్రికి న§ధోగతిపాల్పడకుండ సద్గుణా
కలన నిరాకరించితివి § గా! యిటు సేయుట కయ్య! రాజ! నీ
తెలివికి వేయినోరుల ను§తింపఁగ సాగిరి లోకులెల్లరున్.

సా—బావా! ఈవిషయమై రాజ్యసుఖముల కాసింపక సింధ్యాను నిరాకరించుటం బట్టి మనపూర్వులకన్నను సద్యశ మందితివి.

భీ—బావా! ఎవరికులధర్మములచొప్పున వారు ప్రవర్తిల్లఁ గీర్తి యెట్లబ్బు? ఎట్లైన మనగౌరవము మనము కాఁపాడుకొనుచుంటిమి.

సా—బావా! కులధర్మములచొప్పునఁ బ్రవర్తిల్లమి నపకీర్తి గానుచుండఁ గులధర్మానుసారముగాఁ బ్రవర్తించినఁ గీర్తి యేల యలవడకుండు?

గీ. కులము ధర్మంబు నెఱుఁగని § కుమతు లెవరొ
కూటికై పిల్లలను మ్లేచ్ఛ § కోటి కిచ్చి
యప్రతిష్ఠను జేంద జె§దయ్య! యోగ్య
వర్తనము మానువా రప§కీర్తి గొనరె?

భీ—(మంత్రివంకఁ దిరిగి) అమ్మాయి కాజగత్సింగుసంబంధ మెట్లున్నదో చెప్పుము!

మం—ఇప్పుడు మనకుఁ దటస్థమైనసంబంధములన్నింటిలో నాసంబంధమే యోగ్య మని నాయభిప్రాయము.

మ. బలసంపన్నుఁడు బుద్ధిశాలి వినయవ్యాపారవంతుండు ని
స్తులరాజ్యప్రతిభాసమన్వితుఁడు నస్తోకార్జితద్రవ్యసం
మిళదాయత్తితకోశుఁడున్ మనకు నీమీఁదన్ సహాయంబు దాఁ
జలుపం జాలెడువాఁడుఁ గావున నృపా! యీసందేహ మింకేటికిన్?

భీ—కాని యీజగత్సింగు కొంచెము దుర్వ్యసనపరాయణుం డని వినవచ్చుచున్నదే? నీ కెఱుక పడెనా?

సౌ—బావా! కొంచె మన నక్కఱలేదు, గొంగళులఁదినుచుండి వెంట్రుకల లెక్కించురీతి యౌ నని శంకించుచుంటిని, కాని మన కెల్లరకుఁ దెల్లమైనసంగతియే కావునఁ గొంచెము నుడువుచుంటి.

చ. మొగలుల కీకులస్థులె సముచ్చతులై తొలుదొల్త కన్నెలన్
దగ దని యెంచకుండియు కదా! తగఁ బెండిలి చేసినార; టీ
జగమున లేనిపోనివి నిషాలను జేయుచునుండు, నెల్లరన్
మిగిలి మహోగ్రపాపము లనేకము లితఁ డొనర్చుచుండెడి.

ఇంక వినుండు కొద్దిమాటలలో వాని సర్వవ్యాపారములు చెప్పవాఁడ.

మ. నయదూరుండు నసత్యవాది విగతన్యాయైకమార్గుండు దుష్కా
ర్యవ్యయపారీణుఁడు ద్రోహిహింసకుఁడు, నిర్వ్యాజాగ్రహోగ్రుం
లయనుండో! యనవచ్చు; దుర్గుణగణాలంకారుఁడుం గాఁడె? వా
సియు వన్నెం గొనఁ డంబరేశుఁడు జగత్సింగేమి సామాన్యుఁడా?

పం—ఆర్యా! ఒకవేళ నిజమే యైనను బ్రధానముచేసికొని వివాహప్రయత్నములుకూడ సాగుచుండ నీరీతి ననుకొనరాదు.

భీ—దేనికైన, నింతకు మించినసంబంధము కానరానియెడల నే మనుకొన్న నేమి లాభము?

సౌ—ఇంతకు నాయమ్మాయియదృష్ట మిట్లుండ మన మేమి చేయఁగలము? వచ్చిన సంబంధములన్నియు నిట్టివే రావలెనా? మనలోప మేమియు లేకుండ వానిఁ బరిశీలించికొంటిమి. ఇఁక విచారించిన నింతయే లేకున్న నింతయే కదా?

భీ—వివాహ మేదినమున స్థిరపఱిచిరి?

మం—మనసిద్ధాంతులా స్థిరపఱుచువారు ? అంబరుకన్న నేదేశమున సిద్ధాంతులు కలరు? మనజగత్సింగుతండ్రి జయసింగు జ్యోతిషమునం దనుపమాన ప్రజ్ఞాధురంధరుఁడై యనేకగ్రంథములను గూడ రచించి, మిక్కుటముగా యంత్రశాలలఁ గూడ నిర్మించుటయే కాక, తమదేశస్థులనెల్లరను స్వతుల్యులఁ జేసికొనలేదే? కావున వారే స్థిరపఱిచెదరు.

స్వా—మంత్రివరా! ఆయనచే స్థాపింపఁబడినపుస్తకభాండాగారములు, దివ్యభవనములును, మూఁడువంతు లీజగత్సింగువలన నాశ మొందెను జుమా! ఇంకఁ బూర్తిగా నున్న వఁట.

మం—కానిండు; సిద్ధాంతు లుండిరి కదా? అంతియ చాలును.

(అంతఁ బ్రతీహారి ప్రవేశించి కేలోడ్చి) దేవా! మారువారుదేశీయుఁ డగు నొకపుడమివేల్పు ద్వారమున నిలిచి యున్నవాఁడు. మానసింగు పంపెనఁట.

భీ—బావా! మానసింగు మనకడ కేల పంపెనో కదా?

స్వా—ఆరజ్జులాఁ డేమి కుట్రలు వన్నెనో యేరికిఁ దెలియును? విశదముగా నుండును నా యేమి?

భీ—పొమ్ము; తోడ్తెమ్ము.

ప్ర—(నిష్క్రమించి భూసురునితోఁ బ్రవేశించును).

మం—రాజేంద్రా! అదె! భూసురుఁడు టెంకాయపట్టుకొని వచ్చుచున్నాఁడు, పెండ్లిమాటలకే.

భీ—ఆయన కీయ మని తెలిసియుఁ గూడ నేల యంపెనో కదా!

మం—రాజా! కన్నె లున్నయెడ నిచ్చిన నీయమన్న నడుగుట మానుదురా?

స్వా—బావా! అంతకంత కొకటి కొకటి మించినసంబంధములు వచ్చుచున్నవే!

భీ—ఇఁక నెన్నితటస్థమైన నేమిలాభము?

ప్ర—భూసురేంద్రా! ఇటు దయచేయుఁ డిటుదయచేయుఁడు.

భూ—(రాజుదరిచేరును. రాజు మున్నగువారు లేచి నమస్కరింతురు)

భూ—అభీష్టావాప్తి ర్భూయా, దభీష్టావాప్తిర్భూయాత్.

భీ—అయ్యా! ఆయాసన మలంకరింపుఁడు.

భూ—చిత్తము (అనికూర్చుండ నెల్లరుఁ గూర్చుందురు)

భూ—రాజోత్తమా! నీవును బ్రజలవును సేమమే కదా?

భీ—శత్రువులవలనఁ బలుబాములఁ గుడుచుప్రజలతో నిట్లు జీవచ్ఛవంబువలె నున్నాఁడ.

భూ——పాప! మట్లనే వినుచుంటిమి. పూర్వమువలె నెల్లసంస్థానాధిపతులకు నైకమత్యము లేకుంటచే నాపదలపా లగుచుండిరి, మఱియుఁ దక్కటిసంస్థానములన్నిటిలో మీసంస్థానము మిక్కిలి దురవస్థలపా లగుటయు వినుచు నేయుంటిమి. రాజేంద్రా! దీనికిఁ దగినకారణ ముండలే దనుకొనరాదు, మీ కుపయుక్త లగురాజులతో సంబంధబాంధవ్యాదులు సేయకుంటయే సుఁడీ!

సౌ——భూదేవోత్తమా! మీరు సెల విచ్చినదంతయు నిక్కువమే, కాని మే మాపట్టుదల లింతతో విడుచుకొంటిమి సుఁడీ! ఇందులకు దార్కాణ మంబరేశుఁ డగు నాజగత్సింగునకు మాకృష్ణాకుమారి నిచ్చి వివాహము సేయ వాగ్దానము సేయుటయే. ఇంక రేపో మాపో వివాహము కానున్నయది.

భూ——(తనలో) అన్నా! అంబరేశునకు వాగ్దాన మొనరించి రఁట. నారాక నిష్ప్రయోజనమే కదా! కానిమ్ము, కానిమ్ము, నా కేనివాక్యములు సెప్పి నయముననో, భయముననో మందలించెదనుగాక. (ప్రకాశము) అయ్యో! ఏమంత తెలివితక్కువపనిచేసినారు? ఆయన యొక్క దుష్ప్రవర్తన మెఱుఁగ కుంటిరా? ఆయనదుస్స్వభావమును వర్ణింప నేరితరమౌను? మఱియు నాయన దుర్యశము దిక్కులం ద్రిక్కిఱిసినను గూడ నెట్లొరయరైరి? (అని తల పంకించుచు) కానిండు ఇప్పుడైన నేమియు మునిఁగిపోలేదు. కాని.—

మత్తకోకిల. పేరుఁ డాశ్రితపక్షపాతి వివేకి సద్బలసంశ్రితుం
డారయం ధరణీతలంబున నట్టిఁ డొండొకఁ డుండునే?
సారజాత్యతురంగ సన్మదసామజాళిసమేతుఁడున్
మారువారుమహీధవుం డసమానబుద్ధివిశాలుఁడున్.

ఇట్టిమాతేని నేరీతి మఱచిరి? "బుద్ధిః కర్మానుసారిణీ" యనుట నిక్కదమే కదా! అందులకే మిమ్మేమియు ననరాదు.

సౌ——(తనలో) ఏమీ యీ బ్రేలటి పొగడు? కనుగానక మమ్మెల్లర నిందించుటయే కాక, దుర్మార్గాగ్రేసరుం డగుమారువారు రాజాధముని వెనుదీయక లోకోత్తరునిగాఁ జెప్పుచున్నాఁడు?

భీ——మీ కేఁ డట్టివాఁడే; యైన మాకంతటిభాగ్యము పట్టఁగలదే? అందులకే పెద్ద పరుగులు మాని మాతలకుఁ దగినసంబంధములనే వెతకికొంటిమి.

భూ——రాజేంద్రా! మీతల కాసంబంధము తగదు కావున, నీసంబంధమే దగిన

దని నేఁజెప్పుచుంటిని. రాజోత్తమా! మీ రీవిషయమై సంశయింపను గూడఁ బనిలేదు వినుండు.

మత్తకోకిల. వందనీయుఁడు నీకుమారి వివాహమాడఁదలంచి యీ
చందమిప్పుడు నన్నుఁ బంచె; విచారణం బిఁక నేల? యా
నందమే గద! యట్టిప్రేఁమ గనం దనంతటఁ గోరఁగా;
నందుకై కడువేగ మీరు సమర్పితం దగఁ జేయరే?

పా—ఓయీ! జన్నిగట్టా! తులువయగు నొకయనామధేయుని మాకడ వర్ణించి కర్ణములఁ బీడించుటయు కాక, నీవు మిక్కిలి మమ్ముఁగూడ మేరమీఱిన రీతి నూహించితివి. నీ కేల యీసాహసము?

చ. ఎఱుఁగనివారిచెంత నేటికి లేనియు దబ్బన దబ్బవచ్చు; నీ
గరుసపుఁగజ్జు లాడి కనుఁ గప్పిన డాఁగునె? మీముతేని నిం
దెఱుఁగని వార లేరు? గనఁ నెంతటి కెంతలు చెప్పినావె? ముం
దరయక మమ్ముఁగూడ వహ్వా! యనసాగితి వెంతదిట్టవే!

మం—(తనలో) ఈతుచ్ఛబ్రాహ్మణునికిఁ దగినట్లు చెప్పినాఁడు. (ప్రకాశము) అయ్యా! భూదేవోత్తమా! ఏది యెట్టుల నైన నెవ రెటువంటివారైన; నిఁక నేమి లాభము? మీ కీయధికప్రసంగము గూడ నవసరములేదు, కావున మీ పని కీస్థితినంతయుఁ జెప్పుఁడు.

భూ—అయ్యా! మామహీపాలుఁడు నన్నీవిషయమున నడుగుమని పనిచె, విని పైని మీయభిప్రాయ మేమియో? సెలవిండు.

భీ—చెప్పుఁడు, సావధానుల మైతిమి.

భూ-సీ. రాజోత్తమా! మాదు రాణాకుసీకూఁతు
నీయ వాగ్దానంబు సేయఁబడియె
నంతియ కాని మారయన్నగారికిఁ గాదు
గా! యిది విశదంబు కాదె మనకు?
నాయన మృతి నొందు టాయె; నీపుత్రితోఁ
దక్కటియాస్తి నాహక్కు గాదె?
హాయిగా రాజసింహాసనం బే నెక్కి

మేలుగా రాజ్యంబు నేలుచుంటి.
గీ. గాని నీసుత నీమనుమరాలుగా యదేమొ?
యింతతోఁ బోవు నంచుఁ జింతింప కయ్య!
యెప్పుడును గాంచఁగవిలేక యొప్పుమనముఁ
గయ్యమొందుకు? నీబాల నియ్యవయ్య!

శా—ఆహా! బావా! ఎంతటుక్కారి మానసింగు? వింటిరా? ఎంతటికెంత పన్నెనో.

భీ—తానెట్లు భావించికొనినను "మే మీయము" మని బిగ్గరఁ జెప్పఁడు.

భూ—చిత్తము, పట్లనే పనవి చేయువాఁడ. (అని నిష్క్రమించును)
(అంతఁ బ్రతీహారి ప్రవేశించి) దేవా! సింధ్యాకమసంబంధి భటుం డొకఁడు వచ్చి ద్వారమున వేచియున్నవాఁడు.

భీ—వేగము తోడ్తెమ్ము.

ప్ర—(నిష్క్రమించి వానితోఁ బ్రవేశించి రాజునకు నమస్కరించును)

భీ—ఓయీ! సింధ్యాపశలిచే కదా?

భట—దేవా! మా ప్రభుపురోహితబంధుపుత్త్రమిత్త్రకళత్త్రాదులతో క్షేమమున నున్నవారు, ఈ లేఖ దేవర కంపఁజేయ నేవచ్చినాఁడ.

భీ—(తనలో) అన్నా, ఇదెట్టిదైన నాఁడదవాయక మానునా? కాదో? (ప్రకాశము) ఏమిటో? బావా. చదువుము.

శా—(లేఖ నందుకొని చదువ నభినయించును) ఓయీ భీమసింగుమహారాజా!

ఉ. హాని యనాక, పుత్త్రినుపహారముగా వెస నోడుజాతి స
న్మాని వటంచు మే మడుగ, నమ్ముఁ గాదని; మానునైరికిన్
"దాసము నేతు నే" నని ప్రతిధానము సేయుట విన్నవాఁడ; నిం
కేనియు బుద్ధి తెచ్చుకొని యింతి నిఁకి మ్మలమానసింగుకై.

క. ఈదారినైనఁ ద్రొక్కము
లేదా; మఱి నిన్నుఁ గూల్చి లేచెద మిదిగో!
మీఁదాలోచన సేయఁగ
రాదా! మా కిట్లు సేయ రాదా చెపుమా?

చ. పఱిపఱిచేయ సాధువులపైఁ బడి, బల్మినిఁ బట్టి యెల్లరన్
గొఱకొఱ లాడి మీఱి గొంకును జంకును లేక కత్తులం
బఱపఱభాగజాలములఁ బట్టి పలార్చినయట్లు జంపునా
కఱకుఁగసాయిబానిసలు గాంచిన మీనులసాము లే మొకో?

సిధ్యామొహర్ (అని మిన్నకుండును)

రా—బావా! వింటివా! ఎంతయక్రమముగ నున్నదో?

గీ. కన్నెలను బావ! కడుపారఁగన్నయట్టి
తల్లిదండ్రుల కొప్పదే? తగినవరున
కిచ్చి మోదించుభాగ్య; మింక కేమి చెప్పుదుఁ?
గాల మంతంత కెంత యకాల మయ్యె?

సౌ—బావా! నుఱుమాడుఁ డని కుత్తుకఁ జాఁచి, "నొవ్వకుండవలె" నననెట్లౌను?

మం—రాజేంద్రా, వా రెట్లువ్రాసినను వ్రాయవచ్చును; కాని మనమిందులకు విధి వినయపూర్వకముగా ధీఁ గఱపుప్రత్యుత్తర మిచ్చి, పైని వారిదుర్ణయమును గుఱించి విచారించిన బాగుండును.

భీ—మీయుభయు లుండిరికదా! వ్రాసి యేలాగుననైన వానిదుర్ణయ మణఁగురీతిని యోజింపుఁడు.

మం—అది కలలోనివార్త, అయిన నిదె! వ్రాయుచున్నాఁడ (నని వ్రాయుట నభినయించును)

భీ—వ్రాఁత యైనదా?

మం—చిత్త, మైనది, వినుండు.

చ. మొగలులకయ్య! బాలికలమూర్ఖులదెవ్వరో? యిచ్చియున్న వా
రుగద! యదంత నీతికి విరుద్ధ మటంచును మిమ్ముఁ బోలువా
రొగినగుచుండి రేకద! మఱొక్కటి; మాకులమందు నెందునన్
దగ దని కాదె ప్రాణములు ధారలు వోసిరి? మీ రెఱుంగరే?

భీ—ఔను, బాగుగనే యున్నది, మునుమున్న కన్నెలమొగలుల కిచ్చినవా రంబరుగాజులే! పిదప మఱికొందఱుగూడ నిచ్చినారు, కాని మనమేనాఁడైన నిట్టిపనుల నెఱుఁగుదుమా? పైని?

మం-గీ. మేము మీవారలము గాన మిమ్ము ననుస
రించియుందుము, బాలిక నెంచి చూడఁ
బరులవస్తువు గాదటే? ప్రభువరేణ్య!
కాన నాబాల గోరని కార్య మెట్లు

సా—ఇట్లును గూడ వ్రాయుఁడు.

ఉ. కోరఁగ రాదు మీమహిమకును మ్మలినం బుదయించులాగు, మా
వారలవంశవర్తన లవంబును గాంచక తీవ్రకోపవి
స్తారులు మీరలై యిటుఁ గృపాభర మించుకయైన వీడకే
దారుణవాక్కులం ధృతివిదారణ సేయఁగరాదు భూవరా!

మం—చిత్త, మిట్లు తప్పక వ్రాయఁదగినదే!

భీ—పైని?

మం—వినుండు; దీనితో విరమించితి.

ఉ. ఈయఁగఁజాలఁ బుత్త్రి నలహీనుని కేను త్రిశుద్ధిగా నృపా!
చేయఁగఁజాల మీర లిటుఁ జెప్పినపద్ధతి నెంతమాత్రముఙ్
బాయఁగఁ జాల ధర్మవు నిబద్ధముగా నలరాజుఁ ద్రోసి; యే
డాయఁగఁజాలఁ బాప, మకటా! యిఁక నేటికిరాజచంద్రమా!

సా—మంత్రివరా! వ్రాయుసంగతులు ముగిసినచో లేఖ నంపివేయుము.

మం—మంచిది (అని లేఖ వార్తాహరున కిచ్చును)

భీ—మంత్రివరా!

గీ. దూదికణములరీతిఁ దుత్తునియ లగుచు
మనమునిందును స్వాస్థ్యము గొన దదేమొ?
కష్టములనెల్లఁ బాసి నిష్కంటకముగ
నుండుభాగ్యంబు నొందుట యున్నె నాకు.

మం—మహారాజ! ఆపదలు కాపురముండునా? ఎట్లొకటి కొకటి తటస్థమౌ
నో యట్లనే యొక టొకటి తొలగిపోవును.

భీ—నామనము పిచ్చిమెత్తిన ట్లున్నది గావునఁ గొంతతడవు శయనించెద.

మం—చిత్త మట్లనే చేయుఁడు.

భీ—ప్రతీహారీ! శయనాగారమునకు దారి చూపుము.

ప్ర—దేవా! ఇటు దయచేయుఁ డిటు దయచేయుఁడు.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము.



శ్రీ ర స్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## చ తు ర్థాం క ము.

### 1. రంగము అరణ్యమార్గము.

[మార్గాయాసఖిన్నుఁడై భూసురుఁడు ప్రవేశించును]

భూ—ఉస్సురంగా! (యని) ఈమార్గమున కంతము లేకున్న దే! నడచినకొలఁదిని బెరుగుచునే యున్నది, ఆహా! నడువఁ గాళ్లురా కున్నయవి. దీనికిఁ దోడు దప్పి కూడ నోట నూటరైన లేకుండఁ జేయుచున్న దే! కావునఁ బయన మిఁచుక కట్టిపెట్టి ప్రచ్ఛాయశీతలం బగు నేదేనివృక్షమూలము నాశ్రయించెదను గాక. (అని పరిక్రమించి దృష్టినిగుడించి) ఆఁ! అదె! శాఖోపశాఖలచే నెండుకొని గుడారమువలె వెల్గొందుచు, బాటసారులకు మనోభీష్టసౌఖ్యసంధాయకం బై వఱలు నా మహీజము తావుఁ జేరెదను గాక. (పరిక్రమించి చేరి కూర్చుండి) ఆహా! ఏమీ! యీవృక్షరాజము సంపత్తు. తపనకిరణముల నైనఁ జొరనీయక, చిగురు జొంపములచే మంపెసఁగుచు, నానాకకుబంతసమాయాతపక్షికుల కలకలాయమానం బై నవపల్కులు పల్కు చందంబున నొప్పుచున్నయది గా! అయ్యారే! ఈభూరుహమూలం బెంతయు ఖేదాపనోదకం బగుట నే కదా! మలయజము లయ్యును సకలసరిత్తట పటీకుటీరాయితవిటపిలతామంటపచందననందనోద్యానముల నెల్ల నల్లనల్లన విడనాడి మెల్లమెల్లన నీతటమున నే మలయవాతపోతము లెల్ల నుల్లములర వఱలుచుండె. హాయిరే! ఇట్టిచెట్టుం గట్టెదుటఁ గాంచినమాత్ర నెట్టిసంతాపమైనఁ గిట్టుననుట యతిశయోక్తి యౌనా? మఱ్ఱూరే! అంతకంత కిమ్మహీజముక్రింద నే కాపురము సేయబుద్ధి పొడముచున్న దే! (దిగులొంది) అయ్యో! ఇంక నొకమూల యామమంత్రము నడువవలసిన మార్గము నెత్తిపైఁ దన్నుచున్నది! మన మీజాగు సేయ నేలా? (అని లేచి) ఆహా! చాలకాలమునుండి యుదయపురవార్త లెఱుఁగరామిచేఁ గదా!

మన మీరీతిఁ దొందర పెట్టుచున్నది. ఆవిధివశ మెట్టిదో కాని యెంతటియు దయపురమున కెంతటి దశలఁ దెచ్చుచున్నది? కాని నాయక్కచెల్లెలు బావమఱఁది మున్నగు బంధుజనులందఱుఁగూడ నచ్చటనే యుండుటంబట్టి యాపురమున కబ్బెడువిపత్తుల గుఱించి నేనును విచారింప వలసివచ్చుచున్నది. మాబావగా రారాజగురువై యుంటచే రమ్మన్నను వీడి రారైరి. అయ్యో! ఈయనమాటకేమి? అచ్చటిప్రజ లెట్టి మొఱకుఁడులోఁగాని యామరాటు లోకమూల మంగలముల వేఁచుచున్నను బుట్టినమట్టి యని వీడలేక యాపదలనెల్లఁ గుడుచుచునే యుండిరిగదా! ఇంతకు దిక్కుమాలినయక్కుపక్షులవలె నున్నను మరాటులు మిడుతలదండ్లవలెఁ బైఁబడి హింసింప వెనుదీయకుంటకు నాశ్చర్యమొందవలె. ఇన్ని మనకేలా? మనబంధుల మనయూరుఁ జేర్చుకొనియెదము గాక. (అని పరిక్రమించి దృష్టినిగుడించి) ఆఁ! యదె జాంబన్నావధాను లిటకే వచ్చుచున్నాఁడు. ఉదయపురమునుండియే కదా! అచ్చటివింత లేవియో? తెలిసికొనియెదను గాక. ఈ ఛాంధసుని కేమైనఁ దెలియునో? తెలియదో? నేనే చెప్పవలసి వచ్చునో? (అని దరిచేరి) ఇదిగో నన్నగారు ఉదయపురమునుండియేనా? (అంత నవధానులు ప్రవేశించును)

అ—(తనలో) అన్నా! నిర్భాగ్యుఁ డగు నీపేరిగానికండ్లఁ బడితినే? ఇఁక మాకు శుష్కవాదము తప్పదు.

పే—ఏమండో! అన్నగారు! అర్ధచంద్రప్రయోగము లైనవా యేమి? ముఖము ట్లున్నది.

అ—ఓరీ! మూర్ఖా! నన్నట్లు పిలువవలదని నీ కెన్ని యోసార్లు చెప్పియుంటినే, బుద్ధిలేదా యేమి?

పే—(తనలో) అన్నా! ఈయన "నన్నగారూ" అన నీయనభార్య యౌవనావస్థయం దుండుటచే నాకు వదెనవరుస యౌ ననియా? ఈయనతెగులు? కానిమ్ము, కాల్చుకొనియెదను గాక. (ప్రకాశము) అన్నగారూ! మి మ్మేలాగునఁ బిలువవద్దంటిరి?

అ—ఓరీ! ఆలాగుననే పిలువరాదు.

పే—అన్నా! మీయాపెను వదెనవరసను బిలుచుట నాకలవాటండీ!

అ—అదిగో! నీతెగులు పోయినది కాదు, నిన్నందులకే యాలాగునఁబిలువవల దంటిని.

పే—అన్నా ! (అని) అయ్యో ! మఱచితిని. మీ కిష్టములేకుండవచ్చును గాని, యాపె కట్లనే యిష్టము సుమండీ !

అ—(తనలో) ఈదురాత్ముఁ డామె కట్లనే యిష్టమనుచున్నాఁడు. స్త్రీల కీవరుసల వలననే చిత్త మన్యులయెడ సంక్రమింపవచ్చును. కనుక నిటుపై నీరీతిఁ బిలువకుండఁ జేసెదను గాక. (పైకి) ఓరీ! పేరా! ఇంతతోనైన మానక, నీవీ రీతిఁ బిల్చెదేని నీప్రాణములు పుచ్చుకొనువాఁడ, నమ్మము.

పే—మిమ్ములనా? ఆపెనా?

అ—మాయిరువురనుగూడ.

పే—ఇట్లామె చెప్పక నే నెట్లు మానఁగలను?

అ—ఓరీ! మూర్ఖా! నాసెలవా? దానిసెలవా?

పే—చిత్త, మల్లైన, "తాతగారూ" అనియేకదా! పిలుచుట.

అ—ఓరీ! కండ్లగపడవా యేమి? నాజుట్టు చూడుము, నెరసినదా? అట్లేల యని యెదవు?

పే—అల్లైన మీరే పరిశీలించి చెప్పుఁడు (అని వెంట్రుకలఁ దీయ నభినయించును)

అ—ఓరీ! నీతల కొట్ట! ప్రాణములు పోయినవిరా!

పే—అయ్యో! చూచి మీరే చెప్పుఁడు (అని చూపించును)

అ—(పెదవులు చప్పరించుచు) ఓరీ! పేరన్నా! పిత్తాధికముచే న ట్లక్కడక్కడ నెరసినవి. అందులకే మాలతీమొదలగునూనెలు తెప్పించి వాడుచుంటిని. ఇఁక మానమునకుఁ జూడుము.

పే—(తనలో) ఆహా! "ముదుసలికి ముచ్చటలు మెం" డనుమాట కీయనయే యుదాహరణముకదా! మరల నీరీతి ననఁ గత్తితోఁ బొడుచుకొనున ట్లున్నాఁడే? కానిమ్ము. (ప్రకాశము) అల్లైనఁ గఱ్ఱను బాఱపై చిరెండడుగులు పరువెత్తుఁడు చూతము.

అ—(వేడనవ్వునవ్వి) నడు మీప్రయాణములవలనఁ గొంచెము పట్టు చేసినది, లేకున్న నాకొకలక్ష్యమా? ఇంక నెఱుఁగవు కాని, మీతాత యొకసారి గోదావరిలోఁ బడి కొట్టుకొని పోవుచుండఁగా, నేదును దేటిచూడని వాఁడై నమస్కరింప, నేను మూఁడు బారలకుఁ బోయి పట్టి యొడ్డునకుఁ జేర్చితి.

పే—అబ్బా! ఎంతబలశాలురు? ఆనాఁ డెంతటి యౌవనావస్థలో నుండిరో? అట్లైనఁ జిన్నవారలే?

అ—ఓరీ! ఎంతయోకాల మైన దనుకొంటివా యేమి? అంతయు నలువది యేఁబది వత్సరములకులోపేనురా!

పే—ఔను, మీరు చెప్పినచొప్పుననే చూచికొందము. ఆనాఁటికి మీకు సుమారు ముప్పదియేండ్లే యుండుననుఁడు. మీరిప్పుడు సెలవిచ్చినయేఁబదియుఁ గలిపినను, పాపము! నూటికిఁ దక్కువగానే యున్నవి. అడ్డాప్సీలబావాజీవారా యువందలవత్సరములు బ్రతుకలేదా! గనుకమిమ్ములనుబిల్లకాయలుగనే యూహింపఁదగి యున్నది, ఇంక మీయందు నడుముపట్టు, చిన్నకుసిదగ్గు, తల నెఱయుట దేహము ముడుతలువారుట, అనునివియతప్ప, మఱి యేవిధమైనముసలిలక్షణము లున్నవాయేమి? (అనినవ్వుచు) కాని మి మ్మిపై నేలాగున పిలువవచ్చును?

అ—జాంబవన్నాప్రధాను లనుబహిరంగ మైనపే రెఱింగియు నిట్లనెదవేలా?

పే—అయ్యా! మీ రానామధేయము మీవయోవిశేషముంబట్టి సంపాదించిన ట్లున్నదే?

అ—ఓరీ! మూర్ఖుఁడా! ఆపేరు నా కిప్పు డిడినదా? నా శైశవముననే దీర్ఘాయువంది యుండుటకై య ట్లిడినారు.

పే—ఆహా. ఏమీ యానామధేయప్రభావము? దానికేమి, యుదయపురమునుండి యేనా మీరాక?

అ—ఆహా, ఉదయపురమునుండియే, కాని ! నే నేమిరో శతవృద్ధును, సహస్రవృద్ధు నైనట్టు లేల నూరక యట్లు వ్రేలి పడి చచ్చెదవు?

పే—అయ్యా! అపరాధము. క్షమింపుఁడు. నేరక య టంటిని. కుఱ్ఱకాయలేను మహాత్మా!

అ—ఓరీ! పేరన్నా! ఇందుఁ బెద్ద కేమున్నది? చిన్న కేమున్నది? నీకన్నఁ బెద్దవారికి నీవే చిన్న, నీకన్నఁ జిన్నవారికి నీవే పెద్ద.

పే—ఆవేదాంతము నాకుఁ దెలియనిదికాదుకాని, యాపురమం దేవియుఁ జిక్కులు లేవు కదా? మీ రేఁగుటకుఁ గారణ మేమియో సెలవిండు.

అ—అయ్యో! నీ వెఱుఁగవోయీ! కృష్ణాకుమారికి వివాహ మని వేలకొలఁది బ్రాహ్మణ్య మేతెంచినదే.

పే—వివాహ మనుకూలముగా జరిగినదా?

అ—ఏలకో కాని ముహూర్తము తప్పిపోయినదోయీ.

పే—ఆపె యేరికి స్థిరపడెనో యదైనఁ దెలిసినదా? లేదా?

అ—అ దెఱుఁగనా? అంబరేశుం డగుజగత్సింగున కఁట.

పే—అట్లనా యనుకొంటిరి? అందులకే మోసపోతిరి.

అ—అహా! బాగుగఁ జెప్పుచుంటివే? ప్రధానమహోత్సవమునకుఁ బోయి ఫలదానము నేనే, ఈచేతితోనే, యందుకొంటిని.

పే—అంతవట్టు నిక్కువమే! కాని, మారువాఱుదేశాధీశ్వరుఁ డగుమానసింగున కాపె నాపై నొప్పికొనిరి.

అ—అది యెట్లు? కొంద ఱట్లుగూడ ననుకొనిరిసుమా?

పే—మొదట భీమసింగు జగత్సింగునకే ప్రధానము సేసినాఁడు. కాని మారువారు మహీపాలుఁడు సింధ్యాతో సఖ్యము చేసి యాబాలను దన కిప్పింపవలయు నని ప్రార్థించె. దానిపై సింధ్యా వల్లె యని మున్న దాఁ గోరి విఫలమనోరథుఁ డగుటచేఁ గనలి భీమసింగునకు మానసింగునకే కుమార్తె నిమ్మని యాజ్ఞాపించె. అందులకు భీమసింగు మున్ను సింధ్యావిషయమై యెట్లు నిరాదరుఁడయ్యెనో యట్లనే సఱకు గొనఁ డాయె. అందుపై సింధ్యా కోపించి మరాటులతో మిడుతలదండ్లవలె వచ్చి యుదయపురమును గప్పి తమశిరంగులు వాముకొనసాగె, దానికి భీమసింగు భయంపడి, మానసింగునకుఁ గూఁతు నీయ నొడఁబడియె. ముహూర్తము గూడ స్థిరపఱుచుకొనిరి. ఆముహూర్తమునకే మీరేఁగితిరి.

అ—అట్లైన నాముహూర్తమునకు విఘ్న మెట్లు దాపరించినది?

పే—అదియా? వినుండు, మరాటులబారికి నిల్వలేక భీరువగుభీమసింగు మానసింగునకు బాలిక నిత్తు ననుట విని, సాహసికుఁ డగుజగత్సింగు గొప్పకుట్ర నొక దానిని బన్నినాఁడు.

అ—పాప? మాజగత్సింగున కిచ్చెద మన్నబాలికను దా వివాహ మాడుటకై తంత్రము సేయు నామానసింగువిషయమై కుట్రలు వన్నఁ దగినదే? కాని యది యెట్లో? చెప్పుము.

పే—ఆజగత్సింగు మానసింగున కొక్కవారసుఁ డుంట యెఱింగి, యాయనపక్షము గాఁ దలఁచి యుండ, నామానసింగుసైన్యమునుండి సగ మావారసునిపక్షు

మారెను. అంత జగత్సింగు, మానసింగును సులభసాన్యునిగ నెంచి, తనసైన్యములతోఁగూడ నావారసునికిఁ దోడై మానసింగుపైఁ బడె. అంత నుభయ సైన్యములకు మిక్కుటముగు కయ్య మాయెను. పిమ్మట మానసింగు శత్రుధాటి కోర్వనివాఁడై రణభూమి విడిచి పాఱిపోయె.

అ—అబ్బా! జగత్సిం గెంతటితంత్రకాఁడు? తనపైఁ గుట్రలు పన్నువానికిఁ దగిన ప్రాయశ్చిత్తము చేసినాఁడే! పైని.—

పే—ఏమి చేయుట? అట్లు చేఁ జిక్కినశత్రువును దగిలి చంపి కృష్ణాకుమారిని జే కొనిపోయిన నెంతబాగుండును? ఎందులకోగాని యుపేక్షాపరవశుండై మిన్నకుండె.

అ—అయ్యో! ఏ మ్మొ గావించినాఁడు? కాని, యామానసింగుమా టే మైనది?

పే—మానసింగు తా నట్లుపోయినవాఁడై శత్రుపరాభవమున కోర్వంజాలక పొడుచు కొనిచావ నెంచె. కాని యాతనిమిత్రునిచే నూఱడింపఁబడి మెల్లన గోట చేరుకొనియె.

అ—ఆ! యేమీ కోటచేరెనా? అప్పుడైన జగత్సింగు తెలివొందెనా? లేదా?

పే—ఏమి తెలివొందుట? మరలనాకోట ముట్టడించెఁగాని, అట్టియెడ వారిలో వారికిఁ బొసఁగక కయ్య మంకురించె, దానిపై వారసునిసైన్యములాజగత్సింగుసైన్య ముల నొక్కపెట్టునఁ దెగటార్చె.

అ—అన్నా! పాప మపు డాజగత్సిం గేమిచేసినాఁడు?

పే—ఏమి చేయఁగలఁడు? వారిసైన్యాధిపులకు లక్షలకొలఁది లంచముల నిచ్చి తన పట్టపుటేనుఁగును సైతము రణభూమిని విడనాడి పాఱిపోయె. పాప! మాయన సైన్యము లంబరునకును మారువారునకును నడుమను గొట్టెలుకొట్టెలుగఁ బడిన వఁట. ఎట్లనో తుదకుఁ గోటఁ జేరుకొనియె.

అ—కాని, యామానసింగునకును, వారసునకుఁ, బై నేవైనఁ గలహములు పుట్టెనా?

పే—వినుండు,అంత మానసింగు తనకోటను సైన్యములను దృఢపఱుచుకొని, సింధియా సేనాధిపతి యగునమీర్ఖానునిచేఁ గృత్రిమముగనాయనను జంపించి రాజ్యము నిష్కంటకముగ నేలుచుండె.

అ—అట్లైనఁ గృష్ణాకుమారి నేల వరించుటకై రాలేదు?

పే—అందులకే కదా! యాఖాను నుదయపురమున కంపినారు.

అ—ఆవిషయమై యాఖాను రా నేలా

పే—సింధియావిషయమై మఱింతనయమునను, భయమునను, జెప్పి యొప్పింత మనెడి యూహ మదిం బెట్టుకొని, యీవిషయమై కూడ శ్రద్ధవహించినట్లు మాన సింగునకు గోచర మొనటకును వచ్చినాఁడు.

అ—ఆవిషయమై యేవిధ్గమైన మాటలు జరిగెనా?

పే—జరిగెను. దానిచేతనే ఖాను సింధియాకు బాల నీయ రనుమాట గ్రహించి యా పెను జంపించుటకై యత్నించుచుండె నఁట.

అ—అన్నా! ఎంతపాప మొడిగట్టుకొన నెంచినాఁడు? కాని నీకెట్టు లింతవట్టు తెలిసినది? నా కీసంగతులయం దంతయాసక్తియే లేదు. వివాహము తప్పిన దనుమాట విననతోడనే నేనాత్మతఃనము "అయ్యో ప్రారబ్ధమా,, యని బయ లువెడలితి. పైనేమియో చెప్పుము?

పే—ఈవిషయమై దురాలోచనల నిచ్చుటకై యాఖానుఁ డాభీమసింగునకు నమ్మిన మంత్రి యగువిజయసింగునుగూడ దువ్వుచుండెనఁట. మన కెందులకు? ఎచ్చట ననకుఁడు. మాబావమఱది యీసంగతులనెల్ల దినదినము వ్రాసిపంపుచున్నాఁ డు. ఇది యెట్లైనఁ బెద్దపెనుప్రళయము గాకతీరదు. కావున మావారల నెట్లై యిలు సేర్చుకొంటకై పోవుచుంటి. మఱియెక్కడ ననకుఁడు.

అ—అయ్యో! మన కెందుకోయీ! పెంటలోనగ్గి నింటిలోఁ బెట్టికొనుట? ఇంక నడుమఁ జాలమార్గ మున్నది. ఈవితము చాలకాలము గడపితిమి, చాలు. నిఁకఁ బోవుదము.

పే—ఔను, చాలకాల మైనది. తాతగారూ! సెలవో సంగుఁడు. అన్నా! మఱ చితి, క్షమింపుఁడు.

అ—పోరా! గుంటపాడగట్టా!

(ఇట్లిరువురు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

———

# చతుర్థాంకము.

## 2. రంగము ఉదయపురాస్థానము.

[భీమసింగు నజితసింగును బ్రవేశింతురు].

భీ—మంత్రివరా! మగల నాఖానుని గలసికొంటివికదా!

మం—చిత్తము, కలసికొంటిని.

భీ—వినయముగా నావాక్యాలు సక్రుచ్ఛముగా నొడివితివికదా!

అ—నాయోపినవట్లు చెప్పితిని, చెప్పించితిని.

భీ—ఏమైనఁ గ్రొత్తపొంత ద్రొక్కెనా? లేదా?

అ—అమరాటులకింక మీ రెఱుఁగనిదా యేమి? అగ్నిదేవునికి వాయుదేవుఁడు తోడగుమాడ్కి నీకఱకుఁదురకకూడ వారిపక్షమే పలుకవలెనా?

భీ—అన్నా! ఇఁక నేమి దారి? పాషాణములనైనఁ గరఁగింపవచ్చునుగాని, వీరి హృదయములఁ గరఁగించు టెట్లు? కడుపారఁ గనినబిడ్డను జేతులారఁజంపుకొనఁగలరా? "మీవంటిన్యాయాధిపతు లీరీతి న్యాయము దప్పి చరింపరా" దంటివా? "మీ కీయపచారము నొనర్చియెఱుంగ" మనుట మఱువలేదు కదా? నాప్రార్థనలన్నియుఁ దేటపడఁ జెప్పితివికదా? మీ రిట్లాచరించుట జయము కాదని జంకక నొడువుమంటివే? నొడివితివా?

అ—రాజేంద్రా! ఇన్నియేలా? ఇవియేగాక యింకనెన్నియో పూసగ్రుచ్చినట్టు చెప్పితిని జెప్పించితిని. కార్యము లేదని మొదటనే।యంటినే?

భీ—(దిగులుతో) మంత్రివరా! ఇఁక నేమియుఁ బ్రయోజనము లేనట్టే కదా! ఆహా! అమానసింగున కిచ్చెద మని యొప్పికొంటిమే! దానికైనఁ దృప్తి గొనలేదా?

అ—ఎట్లులనైన వారియనుమతిచొప్పునఁ జేయకతప్పదు గావున,మానసింగునకు బాలి కనిత్తు మని యొప్పికొంటిమి, కాని యిం దొక్కటి యూహింపవలసి యున్నది.

భీ—అ దేమియో? చెప్పుము.

అ—సీ. మానసింగ్గునకే కుమారి నిచ్చెద మన్నఁ
బ్రబలుఁడై మనదుమీరనారుఁ బట్టి

సంగరంబున జగత్తింగ భంగురశక్తి
రక్తప్రవాహసంసిక్త పఱచు,
నంగుగా నాజగత్తింగున కీయంగ
బూనుదా! సింధ్యాప్రముఖులతోడ
మననీటిపైఁ బడి మాసింగట భస్మ
పటలం బొనర్చు నక్కట! నృపాల!

గీ. బాల నేరికి నీయక మూల నుంచఁ
గోటపైఁ బడి మేటిమరాటిదండ్లు
తన్ను గొల్వఁగ మనల సింధ్యా, కడంక
మట్టి మనస్త్రీలఁ దాఁ జెఱఁబట్టకున్నె?

భీ—ఆహా! సర్వేశ్వరా! ఇఁక నేమి సేయుదు? నాకేమి గతి? నాకేది దైనఁ ప్రాణవిముక్త్యుపాయము నూపరాదా? కానికూడుఁదిన్నను, గడుపునిండ వలదా? (అని కన్నీరొత్తికొని)

మంత్రివరా! విప్రతిషేధము గలయీకార్యమువిషయమై కర్తవ్యాంశ మరయం బాలక చిత్తంబు సంతాపాయత్త మగుచున్నది. నాకదియేమియోకాని, యీపల్కులు వినిన దాదిగ నించుకయైనఁ బ్రపంచజ్ఞానము లేక మున్నీటఁ బడి మునిఁగి తేలువానికిం బలెఁ, జిత్తంబున దత్తరంబొందు నృత్తంబు సల్పుచుండె. కావునఁ గర్తవ్యాంశంబు యోజించి నన్ని దుఃఖాబ్ధి యొడ్డుం జేర్పవే?

అ—నృపాల! సర్వముం దెలిసియు నన్నడుగ నేలా? అయిన మనము చేయకతీరని దై యుండుకృత్యమును, నున్నది యున్నట్లు, నాయూహించి నవట్టిదే! చెప్పుచుంటి; వినుండు.

భీ—సావధానుఁడ నైతి.

అ—చ. మనమునృపాల! స్త్రీలకవమానముదూరము సేయుటొప్పగున్
విను మొకయాఁడుదానికయి విశ్రుతరాజ్యము బంధుమిత్రులున్
దనయులు ద్రెళ్ళ నేల? వసుధావర! నీమనమందుఁ జూడుమా!
యనుపమరాజ్యసంపదలకై యొకయాఁడుది నచ్చు టొప్పదే?

భీ—ఆహా! ఎంత కర్ణకఠోరములైనమాటలను వింటి? (అని చెవులు మూసికొని)

పిల్లలనెల్లఁ జంపికొనినపై నీరాజ్యసంపద లేలా? కాని యోయీ! మంత్రివరా! ఎంతటియుపాయము చెప్పితివి! (అని కన్నీ రొలికించుచు)

సీ. అతిదీన పసికూన - యసమాన లతకూన
కూఁతు నెట్టులఁ జంపి - కొందుఁ జెపుమ?
కడుబాల గుణజాల - ఘనశీల యదిబేల
కూఁతు నెట్టులఁ జంపి - కొందుఁ జెపుమ?
యతిరూపవతి పుణ్య - వతి ధర్మమతి నాదు
కూఁతు నెట్టులఁ జంపి - కొందుఁ జెపుమ?
పటుభక్తి గుణశక్తి - చటులోక్తి గుణరక్తి
కూఁతు నెట్టులఁ జంపి - కొందుఁ జెపుమ?
గీ. మించి ప్రేమించి కడుపారఁ - గాంచి పెంచి
యుగ్గుపాలోసి పెద్దగా - నోపఁజేసి,
కత్తి యొఱదూసి యెట్లు ద - గ్గుత్తుఁ గోతు?
నమలధీస్తుత్య! యోజింపు - మా! యమాత్య!

(అని కూఁతు నుద్దేశించి) హా! ముద్దులపట్టీ! కృష్ణాకుమారీ!

ఉ. పాలన చేసి తా నొకనృ - పాలుఁడ నంచును విఱ్ఱవీఁగి; యా
మాలసుఖమ్ములన్ని తన - కుమట్టతఁ బొందఁగ నెంచి యెంచి, యే
గోల యెఱుంగకుండి తన - కున్ హితమెంతయుఁ గూర్చునట్టి నా
యాలిని బిడ్డలం దునుము - నంతటిపాపికిఁ బుట్టితేలనే?

(అని కన్నీ రొత్తుకొనుచు) హా! భక్తశివశంకరా! శంకరా!

ఉ. హా! సమపక్షపాతివి క - దా! హర! నీవు, దురాత్ములై సదా
బాసలు పెక్కు చేసి, గుణ - పద్ధతి నెంచక దీనజంతుని
ష్కాసము చేయువారి కధి - కార మొసంగి; మఱెందునైన నే
దోసము లేనివారల న - ధోగతిపాలుగఁ జేయఁబాడియే?

అ—మహారాజా! ఇట్లు చింతిల్ల నేమి లాభము?

ఉ. కష్టము రాకమున్న నృప కైకొని యత్నము, మంచిచేయని
దుష్టముగా వెంలింగెడు; విరోధుల కొంతయు వశ్యమై తుదిన్
నష్టములం గణింపుచు మనంబున ఘూర్ణిలనేల? మీకునున్
స్పష్టముగాదె? వచ్చుగతిఁ బాయఁగ నెంచుట మంచి కాదటే?

భీ—ఆయుపాయ మేదియో? చెప్పుము, నీ కెవ్వియుం దెలియనియంశములు లేవుకదా!

అ—అట్లైన మహారాజా! వినుము, త్రిశుద్ధిగఁ జెప్పుచుంటి.

గీ. మారుమా టాడకయ సీసుమారిఁ జంపి
యాఁడువారలగుట్టు గాపాడు మయ్య!

భీ—(చెవులు మూసికొని) హరి! హరీ! నే నట్టిపని కలనైనఁ జేయంజాల, నిఁక వినఁజాల.

అ—అట్లు మాని మఱియేమి సేయ నగును?

బంధులను జంపి మీరుమీవారదెల్ల
నెత్తురేఱులు సేయంగ నేర్తు రయ్య!

భీ—హా! దైవమా! నా కెట్టివాక్కులు వినవలసె?

ఉ. ఎట్టులనుండువాఁడ? నిఁక నేమిటి సేయుదు? నేరెఁ గొల్తు; నిం
కెట్టుల జీవము న్నిలిపి యొందుల డాఁగుదు? నింక నన్నుఁ జే
పట్టెడువార లెవ్వ; రిది భాగ్యమొ? హా! విధి! హా! సుపుత్రి! హా!
పట్టెసి జంప రాజ్యమనపాయము చేసితె? లోకరక్షకా!

కాని మంత్రివరా! ఇట్లెంతైనఁ జేయఁగలరే? ఒకవేళఁ జేసినను శ్రేయస్కరమై యుండునే? అదియుంగాక. యీరీతి

క. సుతదారోదరపోషణ
మతులై గతి లేక, యే రమాత్య! ధరిత్రిన్
మతిహితసుతఁ జంపిరె? జీ
వితగతిగా నెంచి, మించి వే చెప్పు మిఁకన్.

అ—రాజేంద్రా! "చంపిరా" యని యడుగనేలా?

గీ. రాజ్యసంపదలొందమీ రాజులెల్ల
జోను లనుచును, దారసుతాదు లనుచు
నెంచిరే? వారు ప్రాణ మాశించి రయ్య!
మిట్టమీఁదను రాజ్యంబు కట్టనౌనె?

కనుక వినఁ డీమాటతో విరమింప నెంచుకొన్నాఁడ.

క. ఒకపసికూనను జంపిన
సకలము చేకూరు సౌఖ్యసంతతి భూపా!
త్రికమక చెందెద వేలా?
వికలుఁడవే? నీకు హా! వివేకము లేదే?

మహారాజా! మేటిజోదు లగుమనవారలెల్లరును ప్రాణములపై రవంతేనియు నాసనిడికొనిరే? రాజకాంతలకు బలవన్మృత్యువు గాక వేఱె యబ్బునే? మన రాజోత్తములెల్ల స్త్రీలకు మానభంగ మౌనేమో? యని, స్వయముగ నఱుమాడుచు వచ్చిరి కారా? కావున నిర్హేతుకముగ రాజ్యభ్రష్టుఁడవు కాకుము. స్త్రీలకు మానమె లైనఁ గాఁపాడుము.

భీ—(కొంత తడవు మిన్నకుండి) మంత్రివరా! "మహావిపదంబురాశినిర్మగ్నుండ నగునే నేమియుఁజేయఁజాల" నని మున్నే యనియుండలేదా? కావున నీవే యీభారమునంతయు వహించి యెటులఁ జేయవలసియుండునో? యట్లు కావింపుము. ఆవిధివశ మిట్లుండ మన మేమి సేయఁగలము? కాని రాజపుత్త్రికలలో నట్టిపనికి నొడంబడువా రెవ్వరో యారసి, వారివలనఁ గావింపుము.

అ—రాజేంద్రా! అడియు మీరన నేలా? (అని తనలో) ఆహా! ఈయన "కడుపు తీపుచే నొప్పుకొనఁ" డనుకొంటిని, కాని నావాక్యపాశములకుఁ జిక్కినాఁడే! కనుక మన ముపేక్షింపరాదు. (ఆకాశమువైపు చూచి) ఇట్టిఘోరకృత్యమున కొప్పుకొనువా రెవ్వరో గదా? రోజునకు మితి లేనిభాగములను త్తులం గొలించునాకఱుఁ గసాయీలుఁ గూడ నిండుజీవము గలనాదివ్యమంగళవిగ్రహముం జూచినతోడనే జంకకుందురా? (తలపంకించి) కానిమ్ము, కానిమ్ము, నాశక్తిచే నట్టివారల జతనుపఱుపకుందునా? ఇంతియ చాలు

నాశక్తి, ఇతని సొప్పించితిఁగదా! ఎవ రెట్లుచచ్చినను, ఖాను మనబహు మతి మనకుఁ బాఱవైచు (పైకి) రాజేంద్రా! ఆభారమంతయు నాపై వైచితిరికదా! మీ కెందుల కీగొడవ? నేనే మోసికొనువాఁడ.

భీ—మంత్రివరా! మఱి యిట నే నుండనోప, నంతిపురమున కేఁగెద.

ఆ—చిత్తము. నాపనికై నేఁ బోవువాఁడ.

భీ—ఎవరురా! అచ్చట?

(ప్రతీహారి ప్రవేశించి) దేవా! ఆజ్ఞయొసంగుఁడు.

భీ—అంతిపురమునకు దారి సూపుము.

ప్ర—ఇటు దయసేయుఁ, డిటు దయసేయుఁడు.

(ఇ ట్లెల్లరు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.



శ్రీరస్తు.

# కృష్ణాకుమారినాటకము.

## పంచమాంకము.

### 1. రంగము: ఉదయపురదుర్గము.

[కత్తి చేఁ బూని భైరవసింగు ప్రవేశించును]

భై — ఆహా!! జ్ఞాతిజనసామాన్య మగునీపగ యొండొరులలో నొక రంత మొందినఁగాని, తా నంత మొందదు. అదియునుం గాక యీపగ యనుదానికిఁ బెఱ నీచోచ్ఛ్రితులతోఁ బ్రసక్తియే లేదు. అదియేమిచిత్రమో? కాని యీస్పర్థ, యేఁని నిమిత్తముగాఁ జేసికొని తా నుదయ మయ్యెనో, వారి కొకయపచారమైనం జేయక తాఁ దృప్తి వడయదు. నా కేటికో గాని; మాభీమసింగునియందుఁ జవతిబిడ్డఁ డైనను, ప్రథమమునఁ గసియే లేదు. కాని యంతకంత కాయన భోగపరాయణుం డై నన్నుఁ జుల్కఁ జూచుటచేఁ బ్రవృద్ధమైనది. నేఁటితో మాయిరువురస్పర్థలు నంత మొందుఁగదా! కృష్ణాకుమారి చచ్చినఁ దోడనే యాపెతల్లి యంత మొందకుండునా? ఆమెతోఁ బిడ్డలు గూడను. తుద కీభీమసింగుకూడ మడియక మానఁడు. అందులకే కదా! స్త్రీహత్య యని యిసుమంతయు జంకక యేనొప్పికొంటిని. కాన మఱితడవు సేయనేలా? (అని పరిక్రమించి దృష్టినిగుడించి) అబ్బా! ఎంతలో మూఁడు ద్వారములు దాఁటితిని? ఇఁక నీచెంత నే కదా! కృష్ణాకుమారిభవనము. (అని ముంగలఁ జూచి) ఆఁ! యదె! యాబాలలీలోద్యానము. (అని పరిక్రమించి నిదానముతో)

ఏమీ! "పురుషు లిందు రా రాదు" అని యా? యీయుద్యానవనద్వారమున వ్రాయించినది. తా నేమియో శాశ్వతముగ నందు విహరింపవచ్చు ననియే కాఁబోలు నామె యుద్దేశ్యము? మఱి యేరికైన నీవ్రాలు వారించుఁగాని, మృత్యుభటులను వారింపఁగలదా? (లోఁ జొచ్చి పరికించి) ఔ! ఔరా! ఎమిదీ! ఈయుద్యానము చెలువము?

సీ. సురపొన్న లొకట భాసురలీలఁ గొని చాల
తిన్నగాఁ దీర్చినట్లున్న, వార!
వన్నె సంపంగిమేల్గున్న లందంద నె
త్తావి గ్రుమ్మచు నింపు దాల్చె వార!
రకముగా దిద్దువేదికలచుట్టును వన్నె
చామంతులే తమ్ముఁ జాటు వార!
వికచసౌరభసూనవకుళశాఖానూన
బాలికాడోలికల్ పరఁగె వార!

గీ. కోరకాధారకాఫలాహారసార
శారికాకీరదారికాహారిపారి
జాతభూజాళిభూగంధజాతభూమి
నందనము కాక, యెట్టు లానంద మిచ్చు.

పాప! మీయుద్యానవనపుబాటలు నాబోటి తా నాటల నాడుటకే గాఁ బోలు? నిట్లు బహుప్రయాసలచే నిర్మించినది. ఇఁక నాటల నాడుదును. (అని పరిక్రమించి దృష్టి నిగుడించి) ఆహా!! అదె! కృష్ణాకుమారిభవనము. ఇంతలోనే సమీపింపవలెనా? కొంతతడవైన నాయింతి మఱింతవలపు జీవించుఁ గదా!

(సౌధమునకుఁ జేరి) అయ్యారే! ఏమీ! ఈ భవనవిశేషము? చూచినకొలఁది జూడవేడుక యయ్యెడిని. (సౌధము నధిష్ఠించి). ఓహో! ఈ సౌధరాజమునం దెన్ని శృంగారములు గానవచ్చుచున్నవి?

సీ. చెలువంపుఁబాలగచ్చులమీఁదఁ జిటిచాప
వేసినారుర! పైఁ దివాసు లెన్నొ?
లలితభాకలితభిత్తులఁ జిత్రగతులొప్పఁ
దతమోహనాకారలతల వెన్నొ?
బాజుగా నొప్పు స్తంభంబులం గట్టి రే
డంబుగాఁ గాచదీపంబు లెన్నొ?
వాటంబులౌకీల్కవాటంబులందెల్ల
నిద్దంపుటద్దముల్ దిద్ది రెన్నొ?

గీ. గట్టిగాఁ దావి గ్రమ్మంగ గవట్టివేళ్ల
తడకలెన్నియొ కట్టిరే! దారులందుఁ
దనకుఁ దాఁ గట్టునురునియాస్థాన మేమొ?
సిరుల కీమేడ లేవ వైవలులుఁ జూడ.

(దృష్టి నిగుడించి) ఆహా! అదె! కృష్ణాకుమారి, తనతోడిచేడియలం గూడి యాడుచున్నయది. తనపాలిఁటిమృత్యుదేవత యిట్లేతెంచె నని యెఱుఁగదాయెఁ గా! పాప! మీబాలకీగోల యెట్లెఱుకవడు?

(అంతఁ గృష్ణాకుమారి సఖులతోఁ బ్రవేశించును)

కృ—భాసురాంగీ! ఈపావురముల నిఁకఁ గొంపోయి, వీనితావులఁ జేర్పుము.

భా—మంచిది (అని చేర్చి వచ్చును)

కృ—చేలీ! నాముద్దులచిలుకకు నిన్నటిదినమున వస పోసితికదా!

భా—అమ్మా! పోసినారము, పల్కులు డెన్నియో పల్కనేర్చెనుజుమా!

కృ—సఖీ! దానికేమి? దానియాహారమువిషయమై జాగ్రత్తతో నుంటివిగదా!

భా—అయ్యో! అట్లనెదవేలా? ఆచిలుక కాహారాదులఁ జూడక మమ్ముల భుజింపను దంటివే! మఱచితి మనుకొంటివా యేమి?

భై—(తనలో) ఆహా! ఏమిస్నేహ? మేమిస్నేహము? ఓహో! ఏ మాయాకారము? చిలుకలకన్న ముద్దుఁజిల్కుచున్న దే? పాప! మిట్లనేకదా జీవు లెల్లరుఁ దాము మృత్యుముఖమునం దున్నను; కామితార్థములఁ బ్రేమించుచునే యుందురు. (అని ఖడ్గమువంకఁ జూచి) ఓఖడ్గరాజమా! నీబుభుక్షు దీర్చుకొన సిద్ధముగ నుంటివా? కాని;

ఉ. అఱగొఱకంబు లేక యల రారెడుసీతరుణీలలామ ముం
దఱఁ గడునూలమాల మగు దారి నెఱుంగదు; కాన కోర్కులె
చ్చిఱిల, ముదంబదొంత మదిఁ జెచ్చెఱ నుబ్బుట లూఁగ నుండెఁ; హా!
యెఱుఁగకయుండునట్టు లొక యేటున కాయుసు నుం గ్రసింపుమా!

(అని పోవ నుంకించి మరలి) అయ్యో! పాప! మింతనే చంపవలెనా? ప్రియజనులతో మఱియొక్కింతతడవు ముచ్చటింపనిమ్ము. చెవులపండువగా మన ముఁగూడు వినియెదముగాక.

కృ—కాని, చెలులారా! ఆచిలుకకు నామెతలిదండ్రులకు నెడఁబాపులుచేసి యిట్లు బంధించినందుల కెంతవిచార మందుచుండెనోగా! ప్రాజ్ఞతవచ్చియు నిట్టి యక్రమములు మానకుంటిమే! మనము గాన్పించనియెడల మనతలిదండ్రు లెంత చింతింతురో, యీచిలుకను గుఱించియు నీమెతలిదండ్రు లంతవంతనొంద కుందురా?

కన—అమ్మా! అవియన్నియు నాలోచించినయెడలఁ గాలమెట్లు గడచును? సమస్త వస్తువులవిషయమై యిట్లనే జాలినొందవలసివచ్చునుగదా! అట్లైన మనజీవితాధారములవిషయమై కూడ నుపేక్షఁ జెందిమెట్లు జీవింపఁగలము?

క్షై—ఆహా!! ఎంతకనికరపుగుండె? ఓహో! ఎంతముద్దరాలు? సమస్తవస్తువుల యందు నిట్టిసుహృద్భావ మెందునైనను గాంచనౌనా? ఛా! రారా! ఈరీతిఁ గర్ణరసాయనము లగు పల్కులు పలుకుచు, నతిపుణ్యవతి యై నిర్దోషయై యన్యులఁదలంపక, తన సఖీజనంబుతో నిష్టగోష్ఠిని గాలం బపనయించుచు, మహానందమున నోలలాడుగోల యగునీబాలను నెట్టిమాంసాశనుఁడైనఁ జంప నెంచునా? నాకుఁ దప్పదుగదా? (అని కత్తి యెత్తి ముందంజ వేసి క్రిందఁ బడి లేచి కూరుచుండి) అయ్యో! నాపాషాణహృదయ మేలకో ద్రవించిపోయెను? హా! శ్రీహరీ! నే నెంతయో కఠినాత్ముఁడనై పోయి చంపవలెనని గమకించినను, ఈమహితచారిత్ర సౌమ్యతేజంబు లెల్లఁ బరవశ మొందిపడులాగున గెంటుచుండెఁగా? హా! ఏదీ నా కాఠిన్యము? నా కేమిదీ! మతిభ్రమకలుగుచున్నది! నే నేమిసేయుదు? (అని నిలిచియుండును)

కృ—కనకాంగీ! ఈచిలుకను బట్టినవా రెవ్వరో? కాని, వారలకుఁ బదిరూప్యము లేని బహుమతి నొసంగి దీనితలిదండ్రులకడఁ జేర్చుబాధ్యత నీదియ సుమ్మా!

క—చిత్తము, తల్లీ! తప్పక చేయుదాన.

కృ—అట్లైన నాచేతఁ జేయి నిడుము.

క—అట్లనే చేయుదు)

కృ—(దృష్టి నిగుడించి) సఖులారా! మున్నెన్నడు నాసౌధమునకు రానిమాబాబయ్యగా రీయెడ కేవిచ్చేసినా, రేలకో? రండు, పోయి కలసికొందము. (కృష్ణకుమారి ముందుండి సఖులు వెంటరాఁ బోయి యాయనచెంతఁ జేరుదురు)

కృ—(కేలో్డ్మిచ్చి)

మ. మును పేనాఁడును మీదు బాలఁగని నాన్ మోదించరే మోకదా?
జనకా! యీ యెడఁ జూడవచ్చుటను నాన్ సాధంబు మాన్యంబు; నా
తనువా, పావనమయ్యెఁ గాంచుటఁ గనుల్ న్ ధన్యంబులై యొప్పె; నీ
దిన మెంతో సుదినంబు; మ్రొక్కితి నిదే! దీవించరే! మీ రిఁకన్.

(అని సాష్టాంగపడును)

భై—(తనలో) కటకటా! ఇఁక నే నేమి చేయుదును. నేనెందులకు వచ్చి తినందును. తండ్రీ! అని పాదములపైఁ బడనే నెట్లు చంపనేర్తు? నే నేమి పల్కుదు? (పైకి)

ఉ. మ్రొక్కకుమమ్మ! పాపుఁడను న్ రూపహుఁడ ద్రోహిని ఘాతుకుండనీ
యొక్క శుభంబుఁ గాంచుటకు న్ నోర్వనివాఁడను; మీదువంశ మ
మ్మక్క! నశింపఁజేయుట ముదావహ మం చెద నెంచువాఁడనీ
ప్రక్క మెలంగుబల్లేమ; పరాభవపాత్రుఁడ నోసుపుత్త్రికా!

కృ—(లేచి తనలో) అయ్యో! ఏమిదీ! ఈరీతిఁ బల్కుచున్నారు? నాకేదియేని హాని మూఁడనున్నదియా యేమి? లేకున్న నిట్లన నేలా? (అని సంశయముతో) అట్లైనఁ దనపని చక్కఁబెట్టుకొనియే పోవును. మాతండ్రిగారీవిధమునఁ దూలనాడి యవమానపఱచిరేమో? పాప! మీయనమో మందులకే విన్నఁబాటొందియుండవచ్చును, కాని యీయన యిదివఱ కెన్నడైన నట్టియాగడములు సలుప లేదే? అయిన, నాకడ వెళ్ళఁగ్రక్క నేలా! అరసెదను గాక. (పైకి)

ఉ. ఏల విచార మందెద? ధన్ పేటికి మీరలు వచ్చినార?
లీలను బల్క నేటికిఁ జన్ లించెద రేటికి? మీదు కార్యమీ
బాల యొనర్పనున్న యెడఁ న్ బల్కుఁడు; తప్పక ప్రాణమైన నేఁ
జాలిన నిచ్చుదానఁ, గడున్ సాహసులింతులటం చెఱుంగరే?

భై—(లోన) అబ్బబ్బా! సమస్తవస్తుసముదాయమందు నవ్యాజానురాగము గలయీబాల పుట్టిబంధుజనస్నిగ్ధము లగువాక్యములచే నాహృదయము నీరు చేయుచుండెఁగా! ఇఁక నే నేమి ప్రత్యుత్తర మిత్తు? ఆమెహృదయము

ర్మముం బట్టి, నాయెడ ననురక్తిఁ జూపు వారిలో నెఱింగియుండు టేమి ననుమానించి, కొంచెము తెలిసిన విషయములను వెల్లడించుటకై వచ్చితివి. హా! హా! పెదవిమెదపుటకైన సందు లేకున్నదిగా! (పైకి)

చ. ఉసురులనైన నిచ్చుటకు నోపుదు నమ్మ! కుమారి! మైన నీ
యుసురులు వోసికోఁ దగిన యుత్తముఁ డెవ్వఁడు? దేవుఁ డిప్పు డీ
పసరమువంటి నన్నొకని భావ్యుఁడ టంచెద నెంచకున్నఁ; దా
మసమున వచ్చి నాఁడను జుమీ! యిఁక బేలతనంబ దేలనే?

కృ——(తనలో) ఆహా! ఏమీ! నాయుసురులు వోసికొనుటకా యీయన వచ్చినవాఁడు? నాయెడ నేమియపచార మున్నది? జ్ఞాతిజనసామాన్య మగు వైరముచేతనా? ఒరులచే నియోజితుఁడై యిటు లనుచున్నాఁడా? (అని శంకతో) పాప! యీతనియందు మొదటిహేతు వేమో? యన నట్టిక్రౌర్యము గానరాదే! శత్రురాజు లేరైనఁ గోట ముట్టిరేమో? అట్లనుటకును రణ దుందుభులమ్రోఁత వినరాదే! ఆరసెదనుగాక, (ప్రకాశము).

సీ. పట్టభద్రులు కోటకముట్టడి సేయ వే
వచ్చిరే యిట్లు హాకిరుచ్చినారు?
మాతండ్రి మి మ్మవమానించి మించి కో
పించెనే యిట్లు పరిచించినారు?
పరులు మాపైఁ గసిపట్టఁజాలక మిమ్ముఁ
బంచిరే యిటునిరూపించినారు?
ఈబాల దోస మేనేనియుఁ జేసెనే
యల్కతో మీ రిట్లుపల్కినారు?

గీ. స్త్రీల నీలీలఁ జంపుట పీలు గాని
యంతకేమైన వ్యతిరిక్తమైనరీతిఁ
జంపుదురఁ టయ్య! లోఁదిలకింపు మయ్య!
యలుక మీ కేటి కయ్య! బాకబయ్య! చెపుము,

భా——(రహస్యముగ), సఖీ! కనకాంగీ! ఈరాచకటకు మెఁలక మన చెలియను జంపుటకే! వచ్చినాఁడఁట. వింటివా? ఇఁక మన కేమిగతి? ఏమి సేయఁగలము నన్నైనఁ జంపరాదా? నో రెఱుఁగని పసికూననా చంపుట?

క—(రహస్యముగ) సఖీ! దైవదుర్విలాసమున నెట్టివారికి నేవియో? యాపదలు తటస్థమౌచునే యుండును, కాని యిట్టియెడనైన ధైర్యముఁ బాయక యీామె పల్కినపల్కులు వింటివి గదా? అతఁ డేమి యుత్తర మిచ్చునో? వినుము.

బై—(దుఃఖముతో) తల్లీ! కృష్ణాకుమారి! నే నేమి చెప్పఁగలను? మూర్ఖుఁడనై యిటు లేఁగుదెంచినాఁడ; మీతండ్రి పెక్కండ్ర రాజపుత్త్రుల నిన్నుఁ జంప వేఁడుకొన, "మమ్ముఁ జంప నొప్పుకొందు" మనువారే! కాని యం దొకఁడైన నీఘోరకృత్యమునకుఁ దలపెట్టఁడాయె, నందులకై యీచండాలుఁ డొప్పికొని యిటేఁగుదెంచినందులకు క్షమించెదవు గాక. (అని పాదములపైఁ బడును)

కృ—అయ్యో! పెద్దలు, మీ రిట్లాచరింప నౌనా? (అని పెడకుఁ జనును)

బై—(లేచి నిలువంబడి) ఛీ! దుష్టఖడ్గమా! పలుబాములు పెట్టునామురాటుల నేమియుఁ జేయం జాలక నోరెఱుఁగని పసికూనలపైనా నీపెత్తనము? (అని త్రిప్పి పాఱవైచును)

కృ—బాబయ్యా! నాయనగారే యి ట్లంపినారా? అది యేటికో గదా? వీరైనఁ దెల్పెదరు గాక.

బై—అయ్యో! తల్లీ! వినుము.

సీ. రాణిగా నిన్నుఁ గొన మాను రాటిరేఁడు
వ్రాసె లేఖను; దాని ని రాకరించె,
నందుకై నీదుతండ్రిపై నల్గి యతఁడు
"నీదుకూఁతును జంపుదా లేద? యిప్డు.

క. బంధులఁ జంపుచు నీదగు
బంధురరాజ్యంబుఁ గొంచుఁ బైఁబడి యిదె! నిర్
బంధించి యున్న యెల్లర
సింధువులోఁ గల్పఁ గలను జింతింపు" మనెన్.

అందులకుఁ దోడు మనమంత్రి, యొకయాఁడుదానికై సమస్త ప్రజలను జంపుట యుక్తము గాదు. రాజ్యము నెట్లైనఁ గాఁపాడుకొను,, మనిరెు.

కృ—ఆహా!! ఏమిధర్మాలోచనలు పుట్టుచున్నవి? ఇట్టిచిక్కుకోరికల నెవరైనఁ గోర నెంతురా? ఎంతదుర్ణయ! మెంతదుర్ణయము?

బై—తల్లీ! ఇఁక నే నిట నుండఁజాల; సెల వొసంగెదవు గాక. (అనుచుఁ దత్తర మునఁ బోవును)

కృ—(నిశ్చేష్టయై యాసనమునఁ గూర్చుండును)

క—చెలీ! భాసురాంగీ! ఈగండము గడచు టెట్లు? ఆహా! అతులంవ తేనిగుండె యెంతకఠిన మైనది? అయ్యో! ఏకేశ్వరా! నీవే సత్య మైనదేవుఁడ వైనచో నాకఠినాత్మునిపై నొకపిడుగైనఁ బడఁజేయరాదా? (తలపంకించి) ఇంక దేవుఁ డెచ్చట? సత్య మెచ్చట? హా! యుగధర్మ మెంతచక్కఁగా మాఱినది? ఎచ్చట నైన నెట్టి ఘాతుకమృగము లైన నిట్టియాసలం బెట్టుకొనునా?

కృ—చెలులారా! ఎద్దుపుండు కాకికిఁ దెలియునా? వీ రెట్లు చచ్చిన వారి కేమి? ఇంతకు "వా రెవ్వరైన గుండియలపై కుంపటు" లనుకొంటిమే కదా? తుద కీవిధమున వారిదౌర్జన్యమును జూపుచుండిరి.

భా—కనకాంగీ! ఆదురాత్ముఁ డేవిధ మైనదోస మెఱుఁగనిపసికూనలపైనా కసి జెందుట?

క—సఖీ! ఆకుటిలుల కిన్ని గావలయునా? కాని, (అని దైన్యముతో) నన్నుఁ జంపుటకై మాబాబయ్యగారు వచ్చి సాహసింప లేనివారై పోయిరి. ఇందుల కిఁక మఱియేరి నైనఁ గఠినాత్ముల నంపక పోరు; కావున నీలోపుననే తరణో పాయముఁ జూచుకొనవలె, నందులకై దేవతాగృహమునకు మార్గము నూపుఁడు, పోయి సేవించుకొందము.

క—(కన్నీటితో) సఖీ! కృష్ణాకుమారి! మా కేమిగతి? ని న్నెట్లు గాఁపాడెదము? మా కీ యాపద రారాదా? అట్లైనఁ గాఁపాడకుందువా?

కృ—ఆదైవదుర్విలాస మిట్లుండ మన మేమి సేయఁగలము?

ఉ. అక్కట! కాంతలార! మనకిమ్మందఱము దనివొంద మేడ నేఁ
డొక్కక్షణంబుకిందట సకేమున్నతమై ఖరి నుంట నోపతే
కెక్కడిమాలదైవ మొకకదే! యిటు లెంతలు సేసినాఁడె! య
మ్మక్క! విధాతచర్య గనకనక్కజమై వెలుఁగొందుఁ గాదఁటే!

భా—(గద్గదకంఠియై) హా! సఖీ! నిన్నే మియుఁ గాఁపాడ నోపనివారమై మా చేతులార మృత్యువున కందిచ్చుచుంటిమి కదా!

క—అమ్మాయీ! కృష్ణాకుమారి! ఇంచుకంత హెచ్చో? తక్కువయో? కాని నీతోటివారలమే సుమా! తప్పక నమ్ముము, మే మింతకు వే ఱొండు సేయం జాలము, గనుక సమ్మతించెదవుగాక.

కృ—(తనలో) హా! ఏమీ వీరల స్నేహసంపత్తి? వీరలుఁ గూడ మడియకమానరఁట. హా! మఱాఁటిబానిసా! ఛీ! దురాత్మా! ఈపాపములెల్ల నిన్నుఁ జుట్టుకొనుఁగాక. (అని కొంత చింతించి) అయ్యో! నామాట కేమి? సతతంబు మితిలేనిబాధలం బడు నాప్రజల కీపయినైన సౌఖ్య మబ్బునో? లేదో? (పైకి)

ఉ. యోధులు శౌర్యసాహసవియోధులు ముం జనునట్టిభీకరా
యోధనకేళిలోన మృతిఁ బొందరె? యిప్పుడు యోగ్యుఁ డామహీ
నాథుఁడు లేఁడుగా! జనవినాశము పెచ్చుగుచుండె నీపయిన్
సాధన మేమియో? కొంత విచారణ సేయవె? దీనరక్షకా!

సఖులారా! నేఁ జచ్చిన రాజ్యబంధుమిత్రపరివారముల కన్నింటికి సుఖమయ్యెడిని, మీరలు నిట్లు సాహసింప నాత్మహత్యాపాతకము తక్క, వేఱె యబ్బునే? కనుక:— (అని దుఃఖముతో సఖులచేతులు పట్టుకొని)

ఉ. మక్కువతోడ నాభర మహామహికవృత్తిని మోసినారు; మీ
కెక్కుడనైన నీచెలి సహింపనియట్టులఁ బల్కునట్టియా
వాక్కులు లెక్కసేయక; కృపారస మొంతయుఁ జిల్క, మీర లిం
కొక్క మహీపసూతిని సయోద్ధతిఁ గొల్చుచు సేమ ముండుఁడీ.

హా! చెలీ! (అని యిరువురుం గౌఁగిలించి)

చ. కసరుటనేర వమ్మ! తమకమ్ము నెఱుంగవు; లోపమున్న లో
విసువును గాంచవమ్మ! కనుపించినఁ బ్రీతిగఁ బిల్చెదమ్మ! హా!
[illegible]సఁ గొన్ని, దేనికైన మముఁ బిల్చుట నేరవు; నాదుచేతలన్
గొసరి యెఱుంగనట్టిపసికూనవు; నీయెడ గోస మెంతునే?

కృ—హా! ఏకేశ్వరా! ఏపాప మెఱుంగనట్టిమా కెట్టిగోలదెచ్చితివి? హా! తండ్రీ! మా కిటు సేయ నేమి యపచార మొనర్చినారము?

చ. తెలుఁగను కష్టదుఃఖములఁ దాల్మిని బాయ నొకప్పుడైన; నే పరుగ సమృద్ధిఁ గాంచి; కలనైనను బొంకుల నాడినేర; నిం కెటుఁగ నధర్మ మేదో? చను నీయను దుష్టుల కెన్న నియుఁ మరగితి నీపదాబ్జము లనమాయికవృత్తి ననంతరూపకా!

(శుకశారికాదులఁ గలయంగాంచి)

శా. గ్రామాభిఖ్య వహించునోశుకములారా! హరిపుష్పోచ్చయా రామవ్రాతములార! పారువములారా! శారికాపంక్తులా రా! మత్స్నేహనిధానసాధతతులారా! మీర లీబాలపైఁ బ్రేమం బుంచరె? దూర మాటకు నభిప్రేక్షించెఁ బ్రేక్షింపరే?

(కొంతతడవు మిన్నకుండి) ఆహా!! ఈజీవితాశానిబంధ మెంతకానిది? ఈ పాశమునకు బద్ధులు కానివార లుండుట దుర్లభముకదా! (అని యురమునఁ జేయి నిడి) ఓయీ! జీవాత్ముఁడా!

ఉ. నిత్యము కాదు దేహ; మ దనిత్యము గావున; దీనిచేత దు ష్కృత్యము లాచరించి, తుదకేనియు వీడవె, మేలు చేసినన్ సత్యుఁడ వీవు; గావున నసత్యుఁపుదేహగతాభిమానమున్ గత్యము గాఁగ నెంచెడియగత్యమదేటికిఁ? దెల్పు నెందుమా!

ఇంక మఱియు నిట్టితుచ్ఛకళేబరములకుఁ జిక్కుకుండెదవు గాక. (చెలుల నుద్దేశించి) చెలులారా! మన కీతడవేలా? దేవతాగారమునకుఁ బోవుదము, రండు.

భా—చెలీ! నీతోడివారలమే కదా! పద, సేవింతము.

క—అమ్మా! మనప్రభాసింగెచ్చట నుండెనో తెలిసెనా?

కృ—దినదినము దేశములపైఁ బడి ప్రజల బాధించుబానిసలగర్వ మడంప సరదారు లఁగొందఱఁ జెంతనిడికొని సౌమ్యసింగుగారితో దేశములం దిరుగుచుండె నఁట, నీ వెఱుఁగవా?

క—కాని, నాకిం దొకయాలోచన బొడగట్టుచున్నది, ప్రాగున్న బాగుండుఁ గాక, లేకున్న లేకుండుఁగాక.

కృ—ఏమియో కదా ?

క—(ఏమియో చెవులోఁ జెప్పును.)

కృ—సఖీ! నీనోఁడి, నెఱవేఱుట కష్టము గావున నాకంతగా మనస్కరించుట లేదు. కాని, బాగుండక పోలేదు, గనుక యత్నము మానవలదు, పోవుదమురండు.

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది పంచమాంకము.



శ్రీరస్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## ప్రస్తావనము.

### 1. రంగము. ఉదయపురదుర్గము.

[త్వరితగతియై భటుఁడు ప్రవేశించును]

భ——ఆహా! కృష్ణాకుమారిదే జన్మము గాక, నిష్ఠురమహారాష్ట్రబాధ పడలేక, కడుం గడు దీనులై యలరునెల్లర సేమముం గోరి, యందులకై తనప్రాణముల ధారవోయ నీయకొని, రాజ్యమునకెల్ల సుఖము కలుగుఁ గాక యని, మహానంద మొందుచున్నది. ఆహా! ఏ మావిధేయత? ఎంతధైర్య? మెంతదైర్యము? పురుషులయందు నటిసాహసధైర్యాదు లనమేయములు కదా? ఛీ! అట్టివీరవనితకా? యిట్టి దురవస్థలు తటస్థించుట? పట్టణమంతయుఁ దనుపిల్లల కీయాపద మూఁడిన ట్లేడ్చుటయే యామెమహార్ఘ్యమును దెల్పుచున్నది. అందులకే గదా యామెను జంపువా రుండుటయే కష్టమైనది. కాని, యిట్టిపరమపావనిని జంపించినచోఁ దన కేమిమోపున్నెముల మాట యబ్బునట్లు అజితసింగుగారు దాఁగటిలోని వెలఁగపండువలెఁ గొట్టుకొనుచున్నారు, హా! ఎంతద్రోహి? ఎంతపాపి? ఈచండాలుఁడు మాకుఁగూడ నీపాపముఁ బంచుటకుఁ గాఁబోలు? ఉండినచోట నుండనీయకున్నాఁడు. ఈదురాత్మున కెంత కాపట్యమును లేనిచో నాయమను జంపింప నంతఃపురస్త్రీల సిద్ధపఱుపఁగలఁడా? ఆహా! నేఁడే కదా విషముఁ బెట్టియామెపట్టిం గిట్టించుట. మనముఁగూడఁ బోవక తప్పదే! (తలపంకించి) మనకేమంత గండకత్తెఱ? ముష్టికి నష్టియేమి? కష్టమునకు నిష్ఠుర ముండునా? అట్టిపనుల నేవైన నియోగించినయెడలఁ దక్షణము కొల్వు విడచి యుతియేనైన సేవించి జీవించెదను గాక. (అవుడుకఅచి) ఆఁ! ఎందులకైన వేగమె పోవుదము; లేకున్న ముక్కోపి; చట్టునఁ దిట్టును (అని నిష్క్రమించును)

ఇది ప్రవేశకము.

# షష్ఠాంకము.

—·—

## 2. రంగము. కృష్ణాకుమారిసౌధము.

[కృష్ణాకుమారి సఖులు, తల్లి యగుప్రభాదేవి, భీమసింగు, మంత్రియుఁ బ్రవేశింతురు]

కృ—(తనలో) కడుదీను లగుప్రజలకును,దలిదండ్రులకును, సేమముఁ గోరి నాప్రాణముల బలి నీయ నీయకొని, సకల దేవతాప్రార్థనలు సలిపితిఁ గదా! ఇంతియ చాలుఁ; గృతార్థనైతి; నబల నగునావలన వీరెల్లరు సుఖించుట చాలదా! యోజింప నిట్టియగణ్యపుణ్యము ననుకట్టవిధించు నావిధాతకు వేయివిధములను సాష్టాంగములు సలుపుదాన. (ప్రకాశముగా) ఓతలిదండ్రులారా! (అని కేల్మోడ్చి)

సీ. నేమముల్ నిష్ఠలెన్నియొ దానములు మీరు
చేసి, నాభారంబు మోసినారు
గారాబుతో నన్నుఁ గాంచి యింతటిదాఁకఁ
బెంచి విద్దెలను జెప్పించినారు
బాల్యంబుచేత నావలన వచ్చిన బాధ
నోర్చి నాపైఁ బ్రేమ చూపినారు
గాంచి నాతప్పు మన్నించి లాలించి బో
ధించి మీరింక మోదించినారు
గీ. తుదకు శాత్రవరాడ్దర్ప దుఃఖమతులు
ప్రజలు మీరును మోదించుభాగ్యఫలము
నాకుఁ దక్కంగ వే చేసినారు మీర
లందుకై వేడ్కఁ గొనుఁడు నావందనములు.

(అని సాష్టాంగపడును)

(అంతఁ దలిదండ్రు లిరువురును దుఃఖముతోఁ గౌఁగిలించి)

తల్లి—హా తల్లీ! కృష్ణాకుమారి!

ఉ. పెంచితి మమ్మ! నిన్ను విలపించుట కీవిధి నోసుపుత్త్రి! మే
లెంచితి మమ్మ! నిన్ను శమియింపఁగఁ జేయుట నెమ్మనమ్మునన్
సంచిత మమ్మ! మాకిది; విసమ్ముఁగ సాయిలుగూడ నెంచునన్
గాంచినయట్టిబిడ్డలఁ "దినం"గను జేసి, సుఖమ్ము గాంతురే?

హా బేలా! హాబాలా!

సీ. ఏప్రొద్దునీసుద్దులే వినంగను ముద్దు,
చాకుమా! నేఁ జత్తు నాకుమారి!
నీభక్తి నీయుక్తి నీనీతి నీరీతి,
యేకాంత కబ్బునే? నాకుమారి!
కాకేల నీలీల సాకఁ జేసెను గోల
నాకంజగర్భుఁడే నాకుమారి!
హా! పట్టి! నా కిట్టి పాప మావలఁ బెట్టి
న న్గావ లేరుగా నాకుమారి!
గీ. నిన్నుఁ గడుపారఁ గంటి; నే మిన్నకుంటి;
నాకుఁబుట్టితి వేమమ్మ! నాకుమారి!
యొరులకును బుట్ట జీవింపవో? కుమారి!
నాకుఁ బోదారి లేదు, కృష్ణాకుమారి!

భీ—(తనలో) ఆహా! ఏమిదీ! ఇంతయమాయికురాలు? ఇన్నినాళ్ళవఱకుఁ బెంచి, పెద్దగాఁ జేసి, తుద కిట్టిదారుణమరణమునకుఁ గారణమైనను; మాపైఁ గసి జెందక యెంతవిశ్వాసమును జూపుచున్నది? మే మెల్లము సుఖించినఁ జాలునని, ప్రాణములపై రవంతేనియు నాస నిడికొనక, చావ నెంచి, "మీరెల్లరుమోదించుభాగ్యఫలము నాదియ కదా!" యని భావించుజ్ఞానవతి యగుపట్టిని గిట్టంజేయ నే నెంతటినిర్భాగ్యుఁడను? నే నెంతపాపాత్ముఁడను? (ప్రకాశము) (ఏడ్చుచు) తల్లీ! కృష్ణాకుమారి!

సీ. నీమంబులో లేక నిష్ఠలో నోములో
పచరించి కంటి; మోపట్టి! నిన్నె
మించి గారాబుతోఁ బెంచి నెమ్మదిని మో

బెంచినారల మమ్మ! కాంచి నిన్నె
ఇంతటిదాఁక మా యింటిబిడ్డవ యంచు
నమ్మియున్నారమో యమ్మ! నిన్నె
విద్దెలా బుద్దులా సుద్దు లబ్బెఘులాగు
చేసితి మమ్మ! మా చిఱుత! నిన్నె

గీ. తల్లిదండ్రులు బంధులం దఱుఁ జలంబు
నూని, యవ్వారు సౌఖ్యంబు నొంద నెంచి
పొట్టకూటికి నాశించి పట్టి! యిప్డు
నమ్ము పెద్దగఁ జేసినా రమ్మ! నిన్నె.

తల్లీ! మా కీపాపఫలము, జన్మజన్మమునఁ గట్టికుడుపకున్నే? ఈపాపులకడుపునఁ బుట్టకుండెదేని; నీ కిట్టిబాములు సమకట్టునా? నీకట్టైనట మా కిట్టివి రారాదా? (అని బాష్పము లొత్తికొనును)

కృ—(తనలో) అన్నా! అంత కంతకు వీరలహృదయసంతాపము హెచ్చుచున్నదే? ఈగర్భమోహమున నాకు ముందు వీరే తెగింతురేమో? కావునఁ గొంచె మూఱడించెదను గాక. (పైకి) జనకా! భూజనామూల్యకనకా! ఇందు మీ దోస మేమున్నది? యోజింప నాకిది సంతోషహేతువే కాని, దుఃఖహేతు వెంత మాత్రమును గానోపదు. మఱియు,

సీ. మీకు శోకం బిట్లు సాకకుండఁగ మీదు
కుక్షి నే మును సొఱకుండరాదె?
చొచ్చితిఁ బో; లోనఁ జచ్చి నిర్జీవనై
యుండి భూమిని పడకుండరాదె?
మనుచుంటిఁ బో; భూమి ఘనరోగములు పట్టి
యింపుతో నన్నుఁ గిట్టింపరాదె?
గిట్టకుండితిని బో; కేఱి గీటెడు వెట్టి
చేఁత లేపున వెల్లి సేయరాదె?

గీ. ఇట్టి వేవైన జరుగ, మీ కెట్టి గోల
యైనయును లేక, సౌఖ్యంబు నందియుండి

యిహమునకుఁ గాంచ వెల్తి యొకింత లేక
పరమునకు లోటు లేకుండఁ బడును గాదె?

కావున జనకా! నిర్భాగ్యురాల నగు నేను మీ కిట్లు పుట్టి కష్టములపాలు సేయుచుంటినిగదా! ఇఁక మీరో, నన్నుఁ గనినందులకు నా కవిర్యాచర్య మగు నీప్రజాసంరక్షణఫలము ప్రాప్త మౌనట్లు సేయుచుండిరి కాదా! ఈయబల కిట్టియుత్కృష్ట కార్యముకన్నఁ గావలసిన దేమి? నా కిదెంతయుఁ బండువగా నే నమ్మికొనుఁడు.

భీ—ఆహా! నాచే నొనర్పంబడుదుర్ణయం బెంతయుఁ బ్రాణమిక్కుటం బైనను, ఉపకారమే యని యీరీతి ధైర్యరస పూరపూరితము లగువాక్యములచే నాహృదయమును నీరు సేయుచుండెఁగా! హా విధీ! మమ్మెంతపాపులఁ జేయ నెంచితివి?

(ప్రకాశము)

క. పుట్టరె బిడ్డలు ధాత్రిని?
గట్టా! యీరీతిఁ జేయఁగల్గిరె చెపుమా?
ఎట్టుల నీ కిది హితమాఁ?
బట్టీ! యిది గాంచ మాకు భావ్యం బెటులౌ?

కృ—తండ్రీ! నా కిదెంతమాత్రమును దుఃఖహేతువుగఁ దలంపకుఁడు. నాజన్మము దీనిచేఁ బావనం బయ్యె; నింక మీ కేమైన దోసముండు ననియుఁ జింతింపకుఁడు. ఏలయన.—ప్రజాక్షేమంకరములగు కార్యముల నాచరించుచు, నావిషయమై ప్రాణములనైనఁ బెట్టుట మనకులోచితధర్మమే కదా? మీకింక బహుజనపోషకత్వము మోసియుండుటం బట్టి యీస్వల్పకార్యమునకై మీరే, ప్రాణముల నీయక, మీరక్తాంకురము నొకదానిని త్రుంచి సకలజనోద్ధారకు లగుచుండిరి. ఇట్టి యుత్కృష్టకార్యములను స్వల్పసాధ్యములుగఁ జేసికొని సాధించుట యుక్తము గాకుండునా? కావున ధైర్యము వీడరాదు; చింతింపఁ బని లేదు. (అని దుఃఖముఁ బట్టలేక తల్లిచేయి పట్టుకొని తండ్రి నుద్దేశించి) జనకా!

ఉ. నాకయి దుఃఖ మొందక, మరణంబున నాదగుతల్లి యీమె,యీ
శోకము పట్టలేక కనుఁ గ్రొక్కుచు సోలుచు సాహసించునే

మోకద? భద్ర మానవుల సోపిక తోడుత నూఱడింపరే?
కూఁకలెఱుంగదీమె, ప్రతికూలము గాంచదు మీకొకప్పుడున్.

(అని కన్నీరు విడచును)

త—హా! నాముద్దులతల్లీ! కృష్ణాకుమారి! ఇటేల మాహృదయముల నీరుచేసెదవు? నేనా నీకుఁ దల్లిని? (కౌఁగిలించి)

ఉ. మక్కువతోడఁ బెంచితిఁ గుమారి! నినుం; ముదమార నిప్డు నా
యక్కునఁ జేర్చి మృత్యువున కందియఁ బూనితి నమ్మ! కాదె? యిం
కెక్కడి తల్లి నౌదు? నిఁక నెక్కడి తండ్రి? యిటింక నిన్ను మే
మిక్కలపాలు సేసియు నరనీహితజీవము నొందుచుండమే?

(అని కన్నీరొత్తికొనును)

కృ—తల్లీ! నీ విశ్లేద్వం జనదు. (కన్నీరొత్తి) మనవంటిమానైకజీవినులకు మృత్యువత్యంతహితకరం బగుచుండ వేఱుగఁ దలంపరాదు.

చ. పరువు గలట్టివారలఁ గృపామతి మృత్యువు దారదృష్టిచేఁ
దిరముగఁ జూచుచుండుట నుతిం గొనుచుండిరిగాదె? లేనిచోఁ
గరువము దాల్చి, ధర్మ మనుశంసను గూఁకటినుండి ద్రుంచు ప్రే
లరులకుఁ జిక్కి యెన్నివగలం బొగులక సమకట్టునోకదా?

వ:ం—(తనలో) ఆహా!! ఏమీ యీమెధైర్యము? తన కిట్టియవస్థ వచ్చినది గదా యని జంకక, శౌర్యధైర్యసారభరితము లగువాక్యములచే హృదయములను మోదానురాగములకుఁ బాదుకొల్పుచున్నది. కాని; పూర్వముదారగుణములచే వన్నెకెక్కిన స్త్రీపురుషావతారములన్నియు నీమెకడ శుశ్రూష చేయఁదగిన వన నిరాక్షేపము. ఆహా!! ఇట్టిసుగుణమణి యని గణింపక నే నెంతపాప మొడిఁగట్టికొంటిని? ఇట్లు మించి వచ్చినపనికై నే నేమిచేయుదు? ఈమె జ్ఞానగర్భితము లగునీవాక్కులు వినినకొలఁది నాహృదయము నీరగుచున్నదే! (ధైర్యమూని పైకి) అమ్మాయీ! కృష్ణాకుమారీ!

చ. సుగుణపవిత్రిపై వగుట శోభితమోదముతోడ నెవ్వగం
బొగులుజనమ్ములపైఁ గృప నమోఘముగా నిటఁ జిల్కియాసలన్
దగ విడనాడి లోనఁ బ్రమదమ్మును గాంచితి; వైనఁ గంటిచే
సెగ యెటులోనఁ గల్గదు? పరించుము! బుద్ధివిశాలవే కదా!

కడుపు దీపుచే నీరీతి శోకానలదందహ్యమానమానసులై యికార్య మాచరించుకొనుటయును, మానుటయును, జాలనినీతలిదండ్రులను రాజ్యసంపదలచే సకల సౌఖ్యంబులను నిరంతరాయ మనుభవింపంజేయునుపాయము నారసి, యెట్లులైన నోదార్చవలెను; కాని యీరీతి మఱింత శోకోద్రేకములగుమాటల నాడుట న్యాయమా?

కనకాంగి—(రహస్యముగా) భాసురాంగీ! ఈదురాత్మున కీమెను జంపించుట యందే వేడుక కలిగిన ట్లున్నదే! కాని యీమె జ్ఞానగర్భితము లగుమాటల వినఁ బ్రత్యుత్తరమున కేమియు సందులేకుంటయే కాక, యొకవిధ మైనశౌర్యము నభిమానమును, జన్యము లయి, సాహసధైర్యములను వెల్లాలనెత్తించు చుండెనే! ఆహా! ఎంతదురవస్థవచ్చినది.

భా—చెలీ! నా కీపలుకు లేమియో? కాని హృదయసంతాపమును బెల్లుబ్బం జేయుచు, నణఁచిన నణఁగక వెల్లివిరియుచుండెనే?

కృ—అయ్యో! శోకమును సమూలముగఁ బీఁకి వేయుటకై నే నెంతధైర్యరసోచితముగఁ బల్కినను, దదభివృద్ధినే చేయుచుండెనా? మఱి యందుల కీజాగు? తెం డావిషపాత్రము. క్రోలి నిర్వృతి నొందెదఁగాక. (అని తనలోఁ దండ్రి నుద్దేశించి) పాప! మీకనైన నేవిధ మైనకష్టములు లేక సుఖంబుండుభాగ్య మున్నదియో? లేదో? నాకై యెంతవంత నొందుదురో? ఆమురాటిబారిన యింక నెన్ని చిక్కులు పెట్టునో? (పైకి) (కన్నీటితో) నాయనగారూ!

ఉ. నే నుదయించుటాదిగ గణింపఁగరానిమహావిపత్తులె
న్నో? నయశాలులై కొనినక్రమ్మున్నతశోకపయోధి నీఁద నిం
తేనియుఁ జాల కిట్లు కృశియించిరి; యింకను మీశరీర మెం
తేనియు దుఃఖమున్ సయిప ; దీపయి నాకుఁ దపింప కుండుఁడీ.

భీ—(దుఃఖముతో) అమ్మా! నా కెట్లీదుఃఖము శాంతించును?

ఉ. సందడి లేని నీభవనసంతతిఁ గాంచిన ; భక్తి యుక్తి నీ
చందము నారయం ; గడుఁబరసం దగువర్తన జ్ఞప్తిఁ గొన్న ; నిం
పందఁగఁ జాలునీపలుకులాదిగఁ జేకొన; ఖేద మీవయిన్
డింపుపడంగఁ జేయుట కడింది గదే? మనసులోఁ దలంచినన్.

(అని కౌఁగిలించును)

కృ—జనకా! ఇందుల కింతవంత నొందనేలా? (అని సఖులచేతులం బట్టుకొని)

ఉ. నాయెడ భక్తిరాగము మనంబున నూల్కొన నన్ని వేళలన్
బాయనికష్టసౌఖ్యములఁ బాయక వీరలుఁగూడఁ బంచికొం
చేయెడనైన వెల్తి నొకయించుకయేనియు లేక, చూచుని
నాయనుగుం జెలుల్గలుగ నాకయి శోకము నొంద టికిన్ ?

కావున నీతివిశ్వాసభూము లగువీరల నాకన్న నెక్కుడుగఁ జూచుకొని యెదరు గాక. (సఖుల నుద్దేశించి) చెలులారా!

గీ. మీర లీమీఁదఁ "గృష్ణాకుమారి యొక్క
సఖియు కల" దంచు మీ మానసంబునందుఁ
దలఁచి కాలంబు నాతల్లిదండ్రులకడ
వెళ్లఁబుచ్చుఁడు; మిమ్ము నే వేఁడికొందు.

(అని యేడ్చుచుఁ గౌఁగిలించును)

సఖులు——సఖీ! కృష్ణాకుమారి!

గీ. కోట పేఁటలు మా కేల? కొంప లేల?
కూటిపైగుడ్డపై మాకుఁ గూర్మి యేల?
వార లేటికి? వీరు మీ వార లేల?
నీవు సచ్చిన నీతోడి చావు దక్క

తల్లి——(పరవశయై యుండును)

కృ——చెలులారా! మీ రిట్లనుట పాడియా? (తల్లిం జూపుచు)

ఉ. పెంగలి యీమె, నాజనని వెఱ్ఱిప్రియంబున దుఃఖపూరమున్
బొంగఁగఁ జేసి తాపమును బొందును, గావున దాని మీరలా
పంగ శ్రమంబు గైకొని; శుభం బగులాగునఁ జూతు రంచు నా
భంగి మనంబులోనఁ బలుభంగుల నేఁ దలపోయుచుంటిఁగా!

కావున మీరలుఁగూడ నిట్లుసాహసింపరాదు. ఈమె నెట్లైనఁ గాఁపాడుచుండవలెను. మిమ్మల నాకన్న నెక్కుడుగఁ జూచికొనఁగలదు, విచారింపక యనుమతి నొసంగుఁడు.

(అంత నెల్లరుఁ గన్నీ రొత్తికొందురు)

కృ——(పరవశత్వమున నున్నతల్లిచేయి పట్టుకొని కలయంజూపుచు)

శా. అమ్మా! నా వగునెమ్మినెమ్మ లవె సుకీమ్మా! నాదుగారాబుకీ
రమ్మా! యల్లదె! శారికానికర మాకీరాముం బదే! పెమ్మిం జే
కొమ్మా! సొంపగుపారువమ్ము లవె! యూకీకొమ్మా! ననుం బ్రోలిమా
యమ్మా! యీ రెసఖీజనంబు, లింకం దేకీమ్మా! పాదముల్ మ్రొక్కెదన్.

తల్లి——హా! సుగుణజాలా! కృష్ణాబాల! కడుపారఁగనుఁగొన్న నిన్నే పెంచికొనలేక, మృత్యువున కొప్పించుచుండ; నీబృందములఁగూఢ నెట్లు భరింపఁగలను? (అని కౌఁగిలించి) తల్లీ! వీనినెల్ల నొప్పించినట్లు నన్నుఁగూడ నేరికైన నొప్పింపవా? (అని చుబుకముం బుడుకుచు)

ఉ. అమ్మ! కుమారి! కూర్మిఁ గలకీయట్టిసమస్తము నొప్పగించి, ఘో
ర మ్మగుప్రీతిఁ గోఁ జన వకీర మ్మని యెంచితి; నాయ మూనె? మీ
యమ్మను గానె నే? నిట నకీయమ్ముగ నేరికి నైన వేగ న
న్నమ్ముడు వెట్టకుండిన రకీయమ్ముడుగం దర మూనె చెప్పుమా?

మం——రాజేంద్రా! ఆపాపాత్ములసంగతి మన మెఱుంగనిది కాదుగదా! ప్రాణికుల హీనుఁ డాఖానుఁడు మన మీపని నెంతట ముగింతు మని వేఁచి యున్నవాఁడు. చాలతడవాయెను; మన మీపని చేయక తప్పదు గదా! ఇంతకు నమ్మాయి కూడఁ బ్రజోద్ధరణతత్పరయై, యేవిధ మైనప్రక్షేప్తమును జెప్పక లోకోత్తరకీర్తిఁ జెంద నున్నయది. కావున, మీరలుఁ గూడ డెందము డించు పఱుపక, ప్రజలెల్ల నీపైసుఖింతు రని యుబ్బుఁగాంచి, "లోకోద్ధరణవిషయమై దారపుత్రాదుల సఱకు సేయని ఘనుం డీతఁడే గా" యని కొనియాడం బడుము. మఱియు నాదురాత్ముఁడు తాఁ జెప్పుపనిని వేగముగా నిర్వర్తించితిమి కా మని, యేమి చిక్కులం బెట్టునో యూహించుకొనుఁడు.

ఫ——(దైన్యముతో) ఓయీ! ఈయొక్కదిన మైన మేమెల్లరమును గలసిమెలసి మాటలాడుకొనులాగునఁ జేయలేవా? ఇంతటితో బిడ్డకును, మాకును ఋణము సరిగదా?

తల్లి——హా! దైవమా! కడుపారఁ గనినబిడ్డతో నైన మాటాడనోవ మైతిమా? మమ్మీరీతి దుఃఖములపాలు సేయ నీకేలా? రక్షింపవా? తండ్రీ!

కృ——(బిగ్గఱగా) హా! త్రిజగద్విఖ్యాతపూతా! భారతమాతా! హా! బలాసాదిత

వైరివారరమా! సిరికాపురమా! ఉదయపురమా! మీకివియా పాటులు? హా! విధీ! హతవిధీ!

సీ. బాప్పరావలువంశ కవాటాళి కీర్తి
దుర్దశ లబ్బెఁగా? తులువనలువ!
అప్రభాసింగునాఁ డవతరించిన రాచ
కొలమునకా? సంత? తులువనలువ!
సదమలవీర్యరా డుదయపురమునకీ
దార వేకసాంవృటా? తులువనలువ!
ఖరతరఖడ్గమ్ము లొఱలలోపునఁ ద్రుప్పు
తోఁ బడియుండుటా? తులువనలువ!
గీ. కాలునకు మెడ లంకెలు గట్టిపెట్టఁ
బున్నెముల నీటఁ ద్రోయంగఁ బుట్టినట్టి
కూళ లౌనట్టియామరా కటీలఁ దట్టి
దొరతనము నిచ్చి మెచ్చుటా? తులువనలువ!

హా! భారతమాత! సద్గుణవ్రాత!

సీ. ఓషధవ్రాతము హిమాల్లసద్రత్నాళి
కాంచనగిరుల భరించి నావు
కాళిదాసాదిసత్కవుల భారంబెల్ల
మోసి, సత్కీర్తిని డాసినావు
గంగానదీకోటి కళింగాకితస్థలి
సంగామలతచేఁ జెలంగినావు
నిస్సారమనక మానస్సారమిడుసస్య
సంతతి నీయంగఁ జాలినావు
గీ. మగటిమికి సేవ యగురాజ మాన్యకోటిఁ
గంటివే! యమ్మ! ముదిమిని గంటివిప్డు;
దానిచే నిట్టివారలు దనరి రహహా!!
మహితగుణజాత! భారతమాత! పూత!

హా! మేవాడీయులారా! మీ కెంతతమము గ్రమ్మినది?

సీ. సతతంబు మీరు భారతమాతసుతులుగా
నారసి, లోనెంచినారు కారు
అన్యోన్య మిట్లు పోరాడుట యదిదేశ
నాశంబుగా నెంచినారు కారు
గతిమాలినట్లు లోమతి లేనిమ్లేచ్ఛుల
పాలన కెదనొచ్చువారు కారు;
"మాకేల' యనుమాట మానికష్టింపంగ
ధీరులై యోజించినారు కారు,

గీ. ఇంక మీ పేడఁ? బాలింపనెంచు టెడ?
నలఘుబల మేడ? స్వాతంత్ర్య మదియుఁ గేడ?
మానధనులార! దేశాభిమానులార!
భవ్యమతులార! మీవారువానులార!

(అంతఁ దెరలో)

ఉ. వింటివె? మంత్రివర్య! వినుపిధిని రక్కసియుక్కడంపఁ దో
ల్లింటిని గాక పట్టపవలింటిదివాకరుమాడ్కిఁ గోపభృ
త్కంటకితాంగభీకరుఁడు ఖానుఁడు రూక్షకషాయితాక్షుఁడై
మింటిని మంటి నుండ కిటుమిమ్ముల రమ్మనుచుండె; రండిఁకన్.

(ఎల్లరును భయభ్రాంతు లగుదురు)

మం—రాజా వింటివా? మొదటనే నుడివియుంటినే? ఆతురక, "తన కీవార్త జాములోపునఁ దెలుపవలయు" నని యాజ్ఞాపించినవాఁడు. ఇప్పుడు రెండు జాము లయ్యెఁ, గావున మన మిపుడైన జాగ్రత్త నొందితిమేని శుభం బగు.

కృ—(తనలో) ఓరీ! పిఱికిపందా! ఇదియా నీజాగరూకత? రాచకొలమున నేల పుట్టితి వోరీ!

తల్లి—హా! నాముద్దులతల్లీ! మాకేల పుట్టితి వమ్మా? ఇఁకనుసరిగదా? నీకును, మాకును ఋణానుబంధము. (కౌఁగిలించిమూర్ఛిల్లును)

భీ—హా తల్లీ! కుమారీ! (అని భూమిం బడును).

సఖులు—హా చెలీ! ఇఁక మా కేమిదారి? (అని కౌఁగిలించును)

కృ—అయ్యా! తెం డావిషపాత్రము, వీరలు మాడకమున్న క్రోలెద.

మం—అమ్మా! బుద్ధిశాలినివి గావున బాగుగ యోజించితివి, ఇదె, తెప్పించుచున్నాఁడ. (అని యిటునటుఁజూచి) ఓసీ! అంతఃపురపరిచారికా! కుటిలకా! మఱియెందులకీజాగు? నీసిద్ధపఱచుపాత్ర మిటు తెమ్మ. ఇంతతో నీమహానీయురాలివలన మన యీరాచకొలమున కేవిధమైనబాధలు లేక, సుఖం బౌఁగాక. ఆమరాటిబానిసలవలన మనయంతఃపురాంగనల కేవిధమైనమానభంగములు గాకుండుఁగాక.

(కుటిలక ప్రవేశించి) అయ్యా! ఇదె, తెచ్చితి. ఇందు నాజాగేమున్నది? (అని విషపాత్రము కృష్ణాకుమారి కీయఁబోవును)

క—ఓసీ! దుర్మార్గురాలా! ఏమి ఘనకార్య మని యొప్పికొంటివే? ఛీ ముండా! పొమ్ము; ప్రాణములపై నాసయున్నయెడ నీ వీచెంతఁ జేరకుము.

భాను—ఓసీ! మందులమారి! ఆవిషముఁ గ్రోలి నీవు చచ్చినఁగాదే? నీకై యేడ్చువా రెవరు? మొదట మాయిరువురకు నిచ్చి, యాపెకడకుఁ బొమ్మ. (అని అడ్డుగ నిలుచును)

కు—ఓసీ! ముండలారా! నాకడనేనా మీపొగరు? మీ మొగము కాలా? ఎంతటి యభిమానమే? పాప! మీబాలను గులగౌరవము తెంచక, కోటపేటల నాక్రమించి, పురుషులనెల్ల వరుసకుత్తులఁ గోసి, యంతఃపుర స్త్రీలకేమి, ప్రదితరాంగనలకేమి మానభంగము చేయ, మీఱవచ్చునామరాటుల కొప్పింపనెంచితె? నోరెత్తకపొండు, లేకున్న మూతిపైఁ దన్నుదాన.

కృ—సఖులారా! మీ కెందుల కీశుష్కవాదము? (అని యాపెంజూచి) అమ్మా! కోపింపక తె మ్మాపాత్రము.

క—ఛీ! కష్టాతిముండా! నీ కేమే యీప్రల్లదములు? (అని లోనికిం బోయి కరవాలంబు గొనివచ్చి) ఓసీ! మందులమారీ!

ఉ. చిచ్చుఱకన్ను విచ్చి,కడుఁ జెచ్చెఱ ముమ్మొనవాలు నెత్తి, యా
లచ్చిమగండు తో డని,చక్రలంబున నుగ్రుఁడు;తా మహోగ్రుఁడై

వచ్చిన వచ్చుఁగాక; యసివార్యులుగా నిటనేఁగి నెంచి వా
క్రుచ్చితి; వామరాటుల నకుంఠితమామకశక్తిఁ గూల్చెదన్.

(అని కత్తి ద్రిప్పుచు) ఓసీ! పింజారీ! ఏదీ! యిఁక నోరెత్తుము, నాశక్తిఁ జూపుదాన, (అని పోఁబోవ)

కృ—(పట్టుకొని) సఖీ! శాంతింపుము. నీవిట్లు వీరావేశ మెందుట కిది సమయము గాదు. ఆమెహృదయ మెట్లున్నను; వెలువడినమాటలు మాత్రము గ్రాహ్యములై యున్నవి. ఇంక నేమైన నీవు పల్కిన నన్ను మనఃక్షోభచే బాధించుదాన వయ్యెదవు. (అనుచుం బోయి యామెకడ విషపాత్ర మందుకొని కొంచెము దవ్వులకుఁ బోయి పాత్రమును ద్రావుటకై యెత్తి పట్టుకొని)

మ. మహనీయా! త్రిపురాసురాంతక హిమక్ష్మాభృత్కుమారీవరా!
యహీరాడ్భూషణ! మంజుభాషణ! యఘవ్యాపాదిదేవాపగా
లహరీసిక్తజటాకలాప! సువినీలగ్రీవ! సర్వజ్ఞ! దు
స్సహశత్రువ్యథ మాన్పవే? ప్రజకు రక్షం బెట్టి, చేపట్టవే?

(అని క్రోలును)

సఖులు—అయ్యో! అయ్యో! (అని కనులు మూసికొని నేలం బడుదురు)

మం—కీర్తిశాలినీ భవ కీర్తిశాలినీ!.

కృ—అమ్మా! కావలసినస్వర్గసుఖములం బడయుము.

తల్లి—(లేచి) హా కృష్ణాబాలా! హా!కృష్ణాబాలా!

సఖులు—(లేచి) ఇఁకఁ నెక్కడి కృష్ణాబాల? కటిలకాఘుటితవిషముం గ్రోలినది, ఇఁక నిరాశఁ జేయనగు.

భీ—(విని లేచి) హాతల్లీ! విషముం గ్రోలితివే? (అనియెల్లరు నేడ్చుచుఁ గూలిలింతురు)

మం—(తనలో) ఆహా! ఈబాల ప్రాణముల వీడ విసముం గ్రోలునప్పుడు గూడఁ బ్రజాసౌఖ్యమునే కోరుచున్నదే? ఇట్టిదేశాభిమానము, సాహసము, ధైర్యము, ఏలోకమందైనఁ గానవచ్చునా? కాని, యేమి యీచిత్రము? ఇట్టి మహాక్రూరవిషముం గ్రోలియు నావేదనలఁ జెందకున్నది?

క. విసముం గ్రోలినవారిల
నుసురుల వే విడువ కిట్లు నిలుంచుట కలదే?

యసమాంబకసంహారుం
డసమాంబకుఁ డొకఁడు దక్క; నయ్యారె! బళా!

త— హా! పట్టీ! నీ కిట్టియవస్థ దెచ్చితిమి. (ఏడ్చుచు)

సీ. మనుపరే? దేవకామినులార! మునులార!
ఘనులార! నాచిన్నికందు నిపుడు
చూడరే? గుణవిభాసురులార! సురలార!
వరులార! నాముద్దుపట్టి నిపుడు
కావరే? జంతుసద్గతులార! యతులార!
వ్రతులార యీముద్దరాలి నిపుడు
గాంచరే? మీరు వాక్షణులార! ఘణులార
గుణులార! నాముద్దుకూఁతు నిపుడు

గీ. అలఘుమతులార! భూతదయాళులార!
రమ్యతరభక్తమానసరాళులార!
యార్తినాశకులార! త్రిమూర్తులార!
కరుణ గావ రయ్య! నాబాలఁ గావ రయ్య!

హా! హతవిధీ! ఇట్టికార్యములకా నీసాహాయ్యము? హా! ఈపసిగాలపైనా పంతము? ఎద్దులవలెఁ బెద్దలమై యుండియు మా కీదురవస్థలం గూర్చి, కార్యసిద్ధి వడయరాదా? హా! మాకీయపకీర్తి యాచంద్రార్కమైనదేనా? మాకీజీవ మేలా? హా! ఏకేశ్వరా! నీదీనరక్షణబిరుదం బెటకుఁ బోయెను? యుగవ్యత్యాసముతో పాటు నీమతివ్యత్యాస మగుచుండెనా యేమి? అదియు మాపట్లనే గాఁబోలు? హా! తల్లీ! కృష్ణాబాల! ఈపాపులను దలిదండ్రులే యనుకొంటివి గాఁబోలు? (ఇట్లన్యోన్యమును గౌఁగిలింతురు).

(తెరలో)

ఉ. ఘంటకుపోన బాలిక నఖండితదుర్విషదగ్ధఁ జేసి, ని
ష్కంటకవృత్తి రాజ్యము సుఖస్థితి నేలుకొనుండు, లేక మా
కంటుపిరంగిబారులఁ గకావికలై తగ బంధువర్గముల్
వెంట నిఁకంటిరా శమనువీటికిఁ బోఁ బయనంబుఁ గట్టుఁడీ!

(విని యాత్రముతో) హా! ఇఁకఁ దప్పదాయెఁగా! (అని తలిదండ్రులు సఖులు మూర్ఛిల్లుదురు)

కుటి—(రహస్యముగా) అయ్యా! ఆయాదేహతత్త్వములంబట్టి విషము పనిచేయుచుండును. కావుననే యీ మెయెడ నిష్ప్రయోజన మాయెను.

మం—ఇఁక నేమిసాధనము ?

కు—(రహస్యము)అయ్యా!మఱియొక విధమునఁగూడ సిద్ధపఱచియే యుంచితిని.(అని ఘుటిక నొకదానినిఁ దీసిచూపి) అయ్యా! ఈవిషప్రభావ మేమియో గాని తాతినివొలిచి యందుల నిడినమంట లుద్భవించుఁ, గావున నీమెయన నెంత? ఎల్లైన నాపె కిది యందీయుఁడు. (అని యందిచ్చును)

మం—(పుచ్చుకొని) తల్లీ! ఇది కూడ సేవించి జగద్విఖ్యాతి వడయుము.

కృ—(తనలో) ఆహా! ఈపాపాత్ముఁ డెంత కుటిలుఁడు? మొదటినుండియు వీని యభినివేశ మిట్లులనే గాన్పించుచువచ్చెను. కాని మన కేలా? వీనికాపట్య ముతోఁ బని యేమున్నది? వీనికాపట్య మెట్లు కాలినను మనయుద్యమ మునకుఁ దోడ్పాటు చేయుండెను గావునఁ బూజనీయుఁడే. మనస్సాక్షిగ లోక సంరక్షణయే కోరి యిట్లువ్యయప్రయాసలనొందిన, నాపుణ్యమునకుఁ బోవుఁ గాక. లేకున్న నాపాపము నెందుఁ గాక. (పైకి) అయ్యా తెండు. (అని పుచ్చుకొని) హా! ఏకేశ్వరా! ఈసారి యైనమృత్యు వొసఁగవా? నాపైఁ గాకున్న దీనులగు నాప్రజలపైనైనఁగరుణింపరాదా?(అని యొక్కింత మెల్లన దలయూపి)అయ్యో! ఏమీ నా తెలివితక్కువ? బూచులను తేఁడగు నామి త్తిగొంగయెచ్చట? మృత్యు వొసఁగుట యెచ్చట?అదియునుంగాక,యుక్తా యుక్తవిలక్షణుం డైనయాపశుపతివర్తన మేమిసున మని యన నోపు?

గీ. తలఁప వేల్పులబున్న నొకదల ధరించి,
కంటిమంటలు గ్రాలఁ దా కగరళము దిని,
కష్టుఁడై యష్టవిధములఁ కగాటిభూమి
నుండునన్వాఁడు భూతనాకథుండు గాఁడె?

హా! దీనజనపోష! వైకుంఠవాస! హా! కృష్ణా! ముకుందా! నీవైనఁ గాపాడరాదా?

గీ. నాఁడు కోర్కుల నిచ్చి కృష్ణాసతీల
లామఁ గాపాడవే? పుణ్యనామ! యోమ
హామహా! యద్రి ఖిల మయ్యె; నావితంబు
నవ్యబిరుదంబు గొనుము కృష్ణా! మురారి!

(అని ప్రింగివేయును)

మం—జగజ్జేగీయమానా భవ. జగజ్జేగీయమానా! (ఎల్లరు లేచి) హాతల్లీ! హా! తల్లీ

(అని కాఁగిలింతురు)

(తెరలో) భయము వలదు! భయము వలదు.

తల్లి—(లేచి)ఏడనుండియోగా! అమృతకల్ప మగునీయభయవాక్కు?(ఎల్లరు సంతో షముతో నల్లడలఁ జూతురు)

(మరలఁ దెరలో)

ఉ. మాలకసాయిబానిస లమాయికవృత్తిని గాంచి వారిగ
య్యాళితనంబుతోడుత నహా! ముటుకొం చెతనంబు సూపఁగా,
శేలలె మీరు? గాంచిన వివేకము లేదచె? చింత యేటికిం
జాలును గాలు బాలకు విసం బిడకుం డటు పైని జూచెదన్.

(విని తల్లి) హా! మా కీయాపద గడవం బెట్ట నెంచినమహనీయా! ఒక్కతు ణముక్రిందట రారాదా? మా కట్టియదృష్టమా? ఇంక బాలిక యెక్కడ? బ్రతు కుట యెక్కడ? హా! తల్లీ! నిర్దోషురాలా!

(అని దంపతులు మూర్ఛిల్లుదురు)

సఖులు—(రహస్యము) భాసురాంగీ! ప్రభాసింగువలె నుండెనే! నే వి త్తినవిత్తు మేలయ్యెను గాని; కాలము గూడ లేదు.

భా—చెలీ! మన కిన్నియేలా? ప్రయాణమునకు మనముఁగూడ సిద్ధముగ నుంటి మిగదా!

మం—(తనలో) ఎవఁ డీసురహంకారుఁడు? వీనికిఁ గూడఁ గాల మాసన్న మాయెఁ గాఁబోలు? కానిమ్ము

కృ—(కేలొగ్గెడ్చి).

దండకము.—శౌరీ! సమస్తాధికారీ! సముద్ధారభారీ! గుణౌఘానుసారీ! కనచ్చక్రధారీ! స్ఫురచ్చంద్రికాజాలహాసాంచితోద్యత్సుమశ్రీ బృందసందోహబృందావనాంతర్విహారీ! మురారీ! ననుంజూడవే? దీనులౌనా ప్రజం గావవే? రావె? నీకన్న మాకెన్నఁగా నున్నవారెవ్వరో? యన్న! మా కీవిపద్వారిరాశిం దరింబెట్టఁగా నీవ యో దేవదేవా! నమస్తే నమస్తే నమః.

(అని మూర్ఛిల్లును)

సఖులు—హా! హా! హా! ఎంతఘోరము? ఎంతపాపము? (అని వెంబడి పట్టుకొని యుపచరించుదురు)

మం—కటకటా! నాకన్న నెంతవాఁడో పాలించిన దీక్ష నీవు పొమ్ము. ఖానునకీ వార్త చెప్పుము.

కు—(మంచిదని నిష్క్రమించును)

(అంతఁ దెరలో)

ఉ. కండల కెక్కి క్రొవ్వి కనుకానక నిండగుత్తై చరించుచున్
గుండియ వాఁడి మిన్నులఁ బడంగనొత్తి, చలింపక యంత మించి, యా
ఖండలముఖ్యరాడ్వరసురాదిక నాయకు లడ్డము వచ్చి పోరినన్;
జండతరోగ్రమాయక ప్రచండభుజాసిబుభుక్షు దీర్చెదన్.

(అని కత్తి ద్రిప్పుచుఁ బ్రభాసింగు తత్తరమునఁ బ్రవేశించును)

సఖులు—(ఏడ్చుచు) బాబూ! మంచిదయపాట్లు చూచితిరా? మేము నిదె చావ సన్నద్ధుల మై యున్నారము.

ప్ర—హా! కృపాలూ! నీ కిదియా పాట్లు? (అనుచు మూర్ఛిల్లును)

తలిదండ్రులు—(లేచి) హా! బాబూ! మాయునగ్గు పాపమును జూడలేక మూర్ఛిల్లితివా? మాకెందుల కీజన్మము?

ప్ర—(లేచి) ఛీ! మీకనులు కాలా! చిట్టింతబిడ్డను విసమును పెట్టి కట్టెదుట నిట్టిం జేసి యిట్టుల నుండిరి గదా? ఛీ! పాపులారా! మీ మిమ్మఁక బ్రతుకనీ రాదు. (అని కత్తి యెత్తి కడెంకతో నుంత్రించాచి)

శా. ఓరీ! మంత్రికులాధమా! యతిదురుక్తద్రోహి! మహాక్రూర! యా
నోరీ! యీవిధి రాజ్యతంత్రముల నెందెందో? నేర్చికొన్నాఁడ; వీ
దారిన్ మీఱి చరించి మోదమును జెందం గోరితో? మృష్టసం
చారీ! గాంచుము తత్ఫలంబిదె! కనన్ జ్ఛాతాసికీలాహుతిన్.

ఓరీ! నీతల గొట్టా నీ కేమి కూడినదోరీ! నిర్దోష యగుబాల నూరక చంప నెంచితివి? ఓరీ! నీ మొగము కాల! మనరాజులెల్ల నీవితమున నే శత్రుహితులైరా? రాచకొలమునఁ బుట్టలేదా?

(తెరలో)

శాంతింపుము! శాంతింపుము!

ప్ర—(తనలో) నాతల పెట్టుకార్యమునకు మూర్తీభూతాంతరాయ మితఁడెవ్వఁడో కదా? (తలపంకించి) కానిమ్ము. కానిమ్ము. (ప్రకాశము కనులుజేవురించి)

ఉ. వారలు వీరుఁగాదు, మనవారలవారలుఁ గాను, క్రౌర్యదు
ర్వాదవిహారులై యలరువారలుఁ గా, దిఁక నెల్లవారలన్
వీరవరాళి ఘోరమతి విఘ్నపరోధికతోరమన్మహా
దారకుఠారధారలకు ధారలు వోయక, శాంతి గందునే?

(అని మహాట్టహాసముతోఁ గరవాలముం ద్రిప్పును)

(అంత సౌమ్యసింగు త్వరితగతియై ప్రవేశించి సింగును బట్టుకొని) బాబూ! నీకేల యీవీరావేశము? ఇందు శత్రు లెవ్వరున్నారు?

ప్ర—బాబయ్యా! క్షణమాత్రము విడువుఁ డీపాపులఁ బరిమార్చి యాపై విన్నవించువాఁడ. అదె! చూడుఁడు; కృష్ణాబాల కెంతటిగతి కల్పించిరో?

సౌ—(చూచి) అయ్యో! అయ్యో! విసముం బెట్టివేసిరా? హా! విధీ! ఎంతసుగుణశీలపై నల్కఁ బూనితివి? (అని ప్రభాసింగుచేయిపట్టుకొనిలాగుచు) బాబూ! ఈయభాజను లెట్లు చచ్చిన మనకేలా? ర మ్మీయూరు విడచి పోవుదము.

ప్ర—బాబయ్యా! ఒక్కక్షణకాల మాఁగుఁడు. ఇట్టిదుర్మంత్రోపదేశముం జేసినందుల కీమంత్రిని యమరాజ్యాభిషిక్తుం జేసి చక్కవచ్చెద.

మం—(దైన్యముతో సౌమ్యసింగునకు నమస్కరించి) అయ్యా! ఆమరాటులకినుక మీ కెఱుఁగనిది కాదుగదా! ఈపెను జంపకున్నఁ దక్షణము తమసైన్యముల

తో వచ్చి కోటముట్టడి చేసి పురుషులనెల్ల నఱుమాడుచు స్త్రీలనెల్లఁ, జెఱఁ బెట్టెద మని కూర్చుండియున్నయెడ; మఱియె ట్లాచరింప శుభం బగునో మీరే చెప్పుఁడు ?

ప్ర—ఓరీ! తులువా! ఉదయపురరాజులకథ లెఱుఁగవురా? ఇట్లే చేయుచువచ్చిరా యేమి ? ఇదె! వారలకడకు నిన్నంపువాఁడ. వారిశక్తి నీ వచటఁ గాంచుము (అనిపోఁబోవ)

సౌ—(పట్టుకొని) బాబూ! శాంతింపుము.

భీ—(దైన్యముతో నల్లుని కడ్డుగ నిలిచి)

ఉ. ఒరుల ననం బనేమి? యిటులోకకృతయాకడుపారఁ గన్నకూఁ
తురు మడయర్క విషంబు గడుదుండగురీతిని బెట్టుదుర్గుణా
కరుని మహోగ్రుఁ బాపు నతికష్టుని దుష్టుని క్రూరచిత్తు న
న్నవల సేయుమయ్య! ముద మాంచెడులోకము; చంపుమల్లుఁడా!

సౌ—కుమారా! దేశోపద్రవ మైనయీమహావిపత్తు నెటులనైన వారింప నెంచి ప్రాణముల లెక్కింపక విషముం గ్రోలెను గాని, లేకున్న నాపెకు వీరలా విషముం బెట్టువారు? అదియునుం గాక మనవార లెట్టులనైనఁ బిడ్డలవలెఁ దమ్ము నమ్ముకొనినతమదేశవాసుల రక్షించి, కీర్తిం గొనుట కులోచితధర్మము కాదే? కావున నీవు వేఱు దలంపక, మనకులము మఱింత మహోత్కృష్టతఁ గాంచె నని మోదింపుము.

(అంతఁ దెరలో)

చ. తరలుము, మంత్రి! తావకసుతద్వయ మల్లన మేడ నాడి, స
త్వరగతిఁ దావకాగమనదర్శనలాలసమై, తదగ్ర వి
స్ఫురదురుకాయమై, జనముచోద్యము నొందుచునుండ, దిర్దిరం
దిరుగుచు భూమిపైఁ బడిమృతిం గానెనయ్య! యిఁకేమి చెప్పుదున్?

మం—(విని) అయ్యో! అయ్యో! బిడ్డలారా! హా! బిడ్డలారా!

(అనిమూర్ఛిల్లును)

సౌ—(విని) హరహరా! (అని చెవులు మూయును)

సఖు—(రహస్యము) చెలీ! మొదటినుండియు నింతటికుల్లు లో నిడికొంటనే యింతఁ గాపించినాఁడు. దాననే యాఫల మిప్పుడె పొందినాఁడు.

ప్ర—బాబయ్యా! చూచితిరా? ఈదుష్టుని దశ.

గీ. మొండుకొని పాపములు దన్ను నిండుకొనిన
కుడుపవే? తత్ఫలం, బేపు నుడుపకున్నె?
బురదకాల్వల పెన్నిటి వఱదవలనఁ
జెఱువు నిండినఁ గట్టలు విఱుగకున్నె?

మం—హా! పుత్త్రులారా! హా! పుత్త్రులారా! (అని నిశ్చేష్టుఁడై కూర్చుండును)

సా—ఓయీ! మంత్రివరా! ఈయేడ్పులవలన లాభ మేమి? పొమ్ము, చూచుకొనుము. (అనిచేయిపట్టుకొని లేవనెత్తి సాఁగనంపును)

తల్లి—(సామ్యసింగు నుద్దేశించి యేడ్చుచు)

శా. అన్నా! యీవిధ మీవిధంజలమువారియందూనుటా? భూమిని
ట్లున్నా నాకిటు సేయ నెంతయును గాకున్నా? ముదంబూననా?
విన్నా నవ్వరె? లోకులెల్ల రోకళ్లై వే నోళ్ల నిందించు, ని
ట్లున్నన్నా! కడుపారఁ గన్నబిడ నన్నా! చంపికొన్నారకో?.

సా—అన్నా! నీవేల యీలీలఁ జింతిల్లెదవు? లోకు లిందులకు నవ్వరు గాని, కుల గౌరవములఁ గాపాడి, జనులెల్లర నిర్బాధులుగఁ జేసి, కులమునకెంతయు వన్నె తెచ్చుకన్నకై యేడ్చుటకు నవ్వకపోరు. (అని రహస్యముగాఁ బ్రభాసింగుం జూచి) బాబూ! జరిగినవట్లు జరిగినది. కాని దీనికై యేమియుఁ జింతింపక నావాక్కు నెఱవేర్చెదవు గాక. అందు వీరలనెల్లైన నూరార్చుట మొదటిపని, దీనికై నీ వేమియు శ్రమపడ నవసరము లేదు. నేనీపని చూచుకొనువాఁడ. నీవుమాత్ర మీ పెకీపై జరుగవలసిన సంస్కారములన్నియు విధ్యుక్తముగ జరిపివేయుము. ఇంకవీరు స్వస్థచిత్తులైనతోడనే మన మిరువురము తత్క్షణము యీ పురము విడిచి యథేచ్ఛం బోవుదము. కావున నీమాత్రము నిర్వహింపుము. మన మిరువురము లేకపోవుట నేకదా? యింతపని పుట్టినది. నీ పని నీవు చూచుకొనుము. నే నిదె! వీరలను వెంటంగొంపోయి యెటులనైన శాంతింపఁజేసి యాహారాదుల నిడువాఁడ.

ప్ర—(రహస్యము దైన్యముతో) బాబయ్యా! నే నెట్లీకార్యము నిర్వహించుదు? (అని కొంతమిన్నకుండి) అయిన మీ వాక్యగౌరవముచే నిదె పూనుకొంటిని. కానిండు.

సా—బావా! ఇట్లైంతకాల మీలీలఁ జింతిల్లెదరు? లెండు స్నానాది విధుల నా

చరింపుఁడు. మనకాలమున కనుపమానయశంబు నీకీర్తిఁ గలుగఁజేసినందున నామెంతయు మహోత్సాహము నొందవలసియున్నది. లె; మన్మథాకా రమ్ము. (అని యాయనను భార్యను వెంటఁబెట్టుకొని పోవును)

ప్ర—కనకాంగీ! మన మీమీఁద జేయవలసిన దేమియైయుండు? కాని యాపె నా డీనిదానము చేయుము. ఎట్లుండెనో చూతము.

క—ఎందుల కీసంశయము? మాలేఖయందలి యంశముల వీక్షించితిరిగదా? అందుల నుదహరించితినే. అట్లనే విష మొకతూరి యీపె కిడ నేమియుం జేయ లే కుండెను. మరల నిచ్చినను గూడ నీపె దేహతత్త్వమున నేమియు వికృత మగునట్లు కాన్పించలేదు, కాని యంతనే మీకంఠధ్వని వినవచ్చుటచే నిద్రింప బడినది. ఇన్నియేలా? ఈమె చిన్నతనమునం దజ్ఞానవశమున విషముం ద్రావి చెక్కుచెదరకుండుటయే మనకు గొప్పసాక్ష్యము. కావున వాయుబంధనము గావించినట్లూహించెద.

ప్ర—అయినఁ జూడరాదా?

క—మంచిది (అని చూచుట నభినయించి) ప్రశస్తముగ నున్నది.

ప్ర—కాని యీవాడుక చెడకుండ నీపెనుగొంపోవలసి యున్నది. కావున కనకాంగీ! నారథమున నీపెను బడవైచి, పేట్లోకరథముం దెచ్చి తలుపుల నెల్ల మూసి, దేశమున సకలబంధుజనోద్ధరణకై ప్రాణములు విడిచినవీరవనిత యని పట్టణమంతయుఁ ద్రిప్పి యెల్లరుఁ జూచుచుండ నాశూన్యశకటమును గాల్పింపుము. ఈరాత్రియందే మనపయనము. సిద్ధముగనుండుఁడు.

భా—బాగుగ యోజన చేసిచెప్పితిరి. అట్లనే చేయుదాన.

(ఇక్లెల్లరు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.



శ్రీరస్తు.

# కృష్ణాకుమారీనాటకము.

## సప్తమాంకము.

### 1. రంగము చిత్తూరులో నొకభవనము.

[ప్రభాసింగు కృష్ణాకుమారి సఖురాండ్రు ప్రవేశింతురు]

సఖులు—(రహస్యముగా) చెలీ! కనకా! చూచితే మన చెలిని? వింతవింతగఁగా న్పించుచున్నది సుమా! వింత వా రెవ్వరులేక యీపెకీవింత యెట్లనోగా?

క—(రహస్యముగ) భాసురాంగీ! నీ వారయకపోతివే? వినుము.

చ. వడి వలరాచవానిబలవంతములన్నియు నిన్నినాళ్లు మా
ర్వడి చెడియుంట, వాఁడిపుడవార్యుఁడు గావున; వింటనమ్ము లె
క్కిడి కడక న్మిటారిని సమీప్సితవృత్తిసి నొంచె, లేక యీ
చిడిముడిపాటు నీబెదరుఁ జిన్నెలువన్నెలు, నిట్టి వచ్చునే?

భా—సెబాస్! చెలీ! బాగుగ నుడివితివే! అదియునుం గాక యిట్టిపురుషమూర్తిని గట్టెదుటం గాంచి మనంబు బిగ్గపట్ట శక్యమౌనే?

కృ—(తనలో) హా! ఏమిదీ! నా కేమియో తత్తరం బొందు పొడకట్టుచున్నది?

ఉ. ఉంటకుఁ దోఁచదాయె; నెటకో? మతిపోయినయట్టులుండెఁ; నాఁ
కంటికిఁ దింట కెంతయు నోకందును రుచ్యము కాదు, చెంతవా
ల్గంటులు కంఠనాదకలకంఠులు పాడినఁ బాడి కాఁ; దిఁ కా
తుంటరివింటిజోదు తతికొడుతఁ గుట్రల నేమి వన్ననో?

ప్ర—సఖులారా!

చ. నెలఁత దురంతతాపము లనేకములం బడి యిన్నినాళ్ల కా
చలిమలయల్లువానికృపచక్కటిపఁపున శోకమెల్ల ని

స్తులగతిఁ బాసి, నిస్తులయశశ్శోగుణశోభిత యయ్యె, నీపెకో
ర్కులుదయివారఁ గోరినవరుం జతఁ గూర్చుట యుండె మాకికన్.

భా—(రహస్యముగా) చెలీ! వింటివే? ఏలకో యిట్లనుచున్నాఁడు? కిరవపు
లగుపురుషులతో మిట్లనరాదుసుమా!

క—ఒరుల కీపెను గట్టెద నని నాఁ డనియా యిట్లంటివి? అట్లనుటకు హేతువు
నీవారయ వైతివి. చిన్నతనంబునుండియు నీయన వీరియింటికడనే యున్నను
"తెలివిడికలవాఁ డనియు, రూపసి యనియు, మేనయల్లుఁ డనియు, నీపె
తండ్రి యోజించి బాలిక నీయన కీయఁ దలపెట్టెనే? అది యొకవేళఁ గొన్ని
నిర్బంధములవలనఁ దలపెట్టలే దనినను, ఈకెహృదయధర్మ మెట్లుండెనో
తెలిసికొన నిట్లనఁగూడదా? అయిన నే సదుత్తర మిచ్చెద వినుము.
(ప్రకాశముగాఁ బ్రభాసింగు నుద్దేశించి)

గీ. కాని, యీచిన్నదానిసొంపూని, దీని
శౌర్యసాహసధైర్యలక్షణము లాని,
కుత్సితుల కెల్ల గుండెలు గుబులుకొలుపు
వానిఁ గూర్పుము మాని పెంపూనుదేని.

కృ—(తలవాంచి యుండును)

ప్ర—(తనలో) అబ్బా! ఏమీ! దీనిచమత్కారము? నన్నునుద్దేశించియే భాషించు
చున్నది? (ప్రకాశముగా) బోటీ!

ఉ. ఎట్టిఁడు, యీపె కతఁకు డెయ్యెడఁ దా వసించియున్న, నీ
పట్టున నాదుబుద్ధివిభవంబున నాతనిఁ దెచ్చి యీపెకుం
గట్టెడువాఁడ, నేఁ గనులు గట్టెడువాఁడ జగానఁ గాంచు, మీ
గుట్టది బ్రహ్మకేనియు నగోచర మాగతిఁ జేసి, మించెదన్.

కృ—(తనలో) అబ్బబ్బా! ఎంతటికఠోరవాక్యములు వింటిని. హా! దైవమా! కొందల
మొందకుము, హా! కందర్పా అబలులకడనేగదా! నీదర్పము? అయ్యారే!
బాల్యమున మాతో నాటల నాడువీనిమేనియం దెచ్చట నీచెల్వము దాఁగి
యుండెనోగా? ఆహా!

సీ. మొల్కనవ్వులజిల్గుమోమున నూనూఁగు
మీసంబు దా నెంతమిసిమి గాంచె?

బెళుకు బేడిసమీలకు తళుకొత్తి మురువారు
కనులెంత నునుసోంగతనము నూనె?
వాటమౌ పెద్దకవాటంబునుం బోలి
పేరురం బెంత దంబారుచుండె?
పరిఘాకృతిం బోలి పరఁగి యొయ్యన భుజా
వల్లు లెంతటి మేటి మల్లు లయ్యె?

గీ. మానమది యెంత? దేశాభిమాన మెంత?
వీఁడు తా నెట్లు మోసెనో వీని నెల్ల?
పైఁ బడం జాలఁ, దాపంబు పట్టఁజాల;
నేల యీలీల నుంటి నే నెంత బేల?

ప్ర—(తనలో) ఔ రాంరా! నే నెంతనిర్భాగ్యుఁడను? ఇట్టిలావణ్యరాశిని, ఇట్టి జగద్విఖ్యాతను, ఇట్టిపరమపావనిని, మఱియెవనికో నేనా సమకూర్చుట? ఎంతటిమూర్ఖుఁడైనఁ దనపాలిఁటిభాగ్యదేవతను దొలఁగం ద్రోయఁగలఁడా? నే నిట్లనుటచే నెవ్వనిఁ గోరనోకదా? అయ్యో! యోజింపక నే నెంతటి వాక్కుల నుడివితి? ఆహా!

సీ. మానికమ్ములమూట మరుని క్రొన్ననతోఁట
నే నెట్టు లోరుల కందింతునొక్కొ?
ఛాయామిఱుతుటారి శంబరారికటారి
నే నెట్టు లోరుల కందింతు నొక్కొ?
చిత్తసరోజాళిమత్తబాలమరాళి
నే నెట్టు లోరుల కందింతు నొక్కొ?
కళుకుబంగరుబొమ్మ కన్నె ముద్దులగుమ్మ
నే నెట్టు లోరుల కందింతు నొక్కొ?

గీ. నీటువగతెన్ను, మేటితంగేటిజున్ను
గబ్బుతులకించుహొరువు క్రొక్కారు మించు
కాము కంఖాణి వానిపుంఖానుపుంఖి
ఎట్టిఁ డైనను నోరులకుఁ గట్టునొక్కొ?

క—(తనలో) ఆహా! అనురూపభర్తృసుఖోత్సేక యగుమాసఖిని జూచి కరువు దీర మోదించుదమన నట్టిభాగ్యము లేకుండెఁగా! ఈబాల బ్రహ్మాండకటాహాతిక్రాంతకీర్తిశోభిత యాటకుఁ దోడు సర్వసుఖాతిక్రాంతం బగునుకూల దాంపత్యసుఖముఁగూడఁ బొందిన మాయుత్సాహ మేరికిఁ గల్గనోపు? ఇదె నానేర్పు వెంపున నీయన నీమెపాదాక్రాంతుఁ జేసెద. (ప్రకాశము) రాజకులమండనా!

ఉ. కోరినరాట్పుత్రిసూతి కోడఁ గూర్చెద నీవె నటంచు మీర లా
దారని బల్కుమాట జవదాఁటఁగ రాదు సుఁడీ! మ ఱెందు నే
వారిని గోరునో? యువిద వారక వీరినో? లేక యేరినో?
కోరుట కేమి? భర్తనొడఁ గూర్చుటకై యిఁక యత్న మొందుఁడీ

ప్ర—(తనలో) ఆహా! ఏమిచాతుర్యముతో నుడివినది? కాని వీరలకు మనయం దెంతయభిమాన మోగదా? వీని కేమి గాని నన్ను వరింపఁజేయుటకై కృష్ణకుమారితోఁ జెప్పక చెప్పినయట్లు "వీరినో, వారినో" యని యేమిబాగుగ నుడివినది? నన్నాపె కోరెడుభాగ్య మీవిధమున నైనఁ గల్గినఁగాదె! (ప్రకాశము) కనకా! ఏరినిఁ గోరునో? కోరు మనుము.

భా—చెలీ! కనకా! నీ వెంత బేలవే?

ఉ. కోరుట కేమి యాపె? పతిఁ గూర్చుట కే మతఁ డిర్వురీయెడన్
గోరియుఁ గోరకున్నటుల గూడియయుండిరి గాదె! యింతటన్
గూరిమితోడ నీవ యొడఁ గూర్చిన నీ కది గాక పోయెనే?
మారుని బోలుక్రూరు బ్రతిమాలెద వేటికె? బేల వేటికే?.

ప్ర—లలనలారా! మీకంతటిస్వాతంత్ర్యము లేకపోలేదు, అయిన నీపెతలిదండ్రులచే నేను నిర్దిష్టుఁడను గాలేదు, కావున వేఱొకనిఁ గోరిన నాకృత్యము నిర్వర్తించువాఁడ.

భా—అట్లైన నీపె కోరువారెల్ల నిర్దిష్టులేనా?

ప్ర—నావలె ననిర్దిష్టులు కారుగదా!

కృ—(తనలో) అయ్యో! ఏమిదీ! వీనియభినివేశమి ట్లున్నది? ఆహా! ఎంతటిప్రాజ్ఞలకైన నీరీతి మాంద్యము గ్రమ్ముకొనునే యుండుఁగదా? ఛీ! ఇఁక నేలా నామౌగ్ధ్యము? (ప్రకాశముగా) బావా!

మ. విసముం గ్రోలితి రెండుసార్లది ననున్ వేధించ లేఁ; దిప్డు నీ
విసపుంబల్కులు విన్నదాదిగ మహావిస్ఫూర్తితో నివ్వి నా
యుసురుంబీల్చుచునుండె; నెంతటిమహోద్యోగంబునుం జెందితో
రసికాగ్రేసర! పెండ్లిపెద్దవొకో? కోరంజాలుదో యన్యులన్?

సీ. కట్టెదో యురులఁ? జేపట్టెదో? యీ మేను
పంచబాణా! సమర్పించుదానఁ
గోరెదో? దీని బల్ దూఱుదో? మానినీ
పంచబాణా! సమర్పించుదానఁ
గాంచెదో? దీని నిందించెదో; కామినీ
పంచబాణా! సమర్పించుదానఁ
గూడెదో? దీనిని వీడెదో? భామినీ
పంచబాణా! సమర్పించుదాన

గీ. నేలెదో? లేక విరహాగ్ని పాలు సేయ
నెంచెదో? లేక గాపాడ నెంచుకొనెదో?
యారా! నీదానఁ బలుబాస లాడుదానఁ
గాను; నే నింకఁ దాళెడుదానఁ గాను.

(అని దైన్యముతో మిన్నకుండును)

ప్ర—(తనలో) ఆహా! ఈపెహృదయము నెంత క్షోభ పెట్టితి? అయ్యారే! ఏమి? యాపంచబాణుని ప్రాబల్యము? ఈవీరవనిత నోట నిట్టివాక్కులా వెడలుట? ఇఁక నావశమా తాళియుంటకు? ఇదె! నా ప్రాణములఁ జూఱ లిచ్చువాఁడ? (పైకి)

చ. అలరులకోరివానిమురువా రెడునాఱవనారసంబ! యో
పొలుపగునాదుపున్నెములమూట! మదుత్కటభాగ్యరాశి! తో
డ్తొలుత నను నేను బల్ముదముతోడుత నోఁచిననోముపంట! యీ
ఖలుని త్వదీయదాసునిగఁ గైకొని సేవల నొందు మంగనా!

(అని కౌఁగిలించి యంకమునఁ గూర్చుండఁ బెట్టును.)

సఖులు—(సంతోషముతో) అనితరావాప్తసుఖసంపత్తిర్భూయాత్.

కృ—(తనలో) హృదయమా! అభీష్టవరబాహాలింగన సుఖమేగదా! నీతుట్టతుదియ యభిలషితము. అట్టియీమహానందామృతరసోపనతవేళయందు నీవేట లీన మైతివి? లెమ్ము. నీకోర్కెలుదీర నీసుఖమును గ్రోలుము.

క—(రహస్యముగా) చెలీ! నేటితోఁగదా మనసఖిబరువెల్లఁ దీరినది? ఇట్టిమహోత్సవము ప్రత్యక్షమై యున్నను; నా కొకస్వప్నమువలె నున్నదే?

బా—(రహస్యము) సఖీ! కలనైన నిట్టిమహావైభవము గాంచెద మనునిశ్చయ మిన్నినాళ్లు లేకుంటను జుమా! ఇట్టిమితిమీఱినయానంద మొందుచుంటిమి

ప్ర—చెలులారా! మనకోర్కెలెల్లఁ దీర నిన్నినాళ్లకుఁ గదా! యనుకూలదైవోపపత్తి నొందితిమి.

ఉ. కూడెఁగనద్యశంబు; జతఁగూడె నిఁ కీమె వరించుభర్త; చే
కూడెను మోద;మింకనొడఁగూడెను దుఃఖమహాబ్ధిదాఁటుటల్;
గూడె ధరిత్రికెల్లననుకూలము మీతరళాక్షిపంపునన్
గూడెనుమీకుమాకు, ధృతిఁగూడెను మీదగుముద్దుగుమ్మకున్.

క—రాజకులమార్తాండా! మీరునోడివినరీతి దైవానుగ్రహముకలన సమస్తవాంఛలుఁ దీరినవి. కాని సర్వజ్ఞులగుమీ కేమియుఁ జెప్పనవసరము కాకున్నను ముగ్ధయగుమాచెచ్చెలినిగుఱించి మాదొకయభ్యర్థన గలదు; దాని నెంతయు మన్నించెదరుగాక.

ప్ర—కనకా! ఈబహిఃకాయము దక్క నిన్నయు మొదటనే మీచెలికి దత్తపఱిచితినే, ఇంక మఱియేమి కోరెదవోగా? కోరుము.

కా—రాజకులదీపా! ఇందుఁ గోరఁదగినదియు, మీరుచెల్లింపఁదగినదియు నేమియు లేదు. అయిన మేమిట్లనఁదగినకాలముగావున నిట్లనుచుంటిమి.

ఉ. రాజకళాధరుండు గిరిరాజకుమారిక మాడ్కి; నాసరి
ద్రాజకుమారి లోకములరాజురమందు భరించురీతి; నా
గ్రాజు స్వకీయజాయ నునురాజముఖస్థితిఁ జేయులాగు; మా
రాజమరాళయాన రతిరాజసుఖమ్ముల గారవింపుమా?

ప్ర—చెలులారా! ఇన్నియేలా? నాకురాజ్యరాజ్యాంగాదిచిహ్నము లంతగా లేకున్నను, ఈయుండుకొనుగ్రామాదులతోనే మీచెలికి దాసుఁడనై కాలంబపనయించువాఁడ.

భా—తమరే మాకొక మహారాజ్యము. అవియున్నవా రేమియింత కెక్కుడను భవింపఁగలరు ? కావునమే మదియొకకొఱఁతగా నెన్నుకొనము. కాని మా చెలి యిఁకఁ దలిదండ్రులదర్శనము దుర్లభ మనివిచారించు నేమో? యని మే మిఁక నిప్పుడే విచారించుచుంటిమి.

కృ—సఖులారా ! ఆవిషయమై మీరెంతమాత్రము విచారింపవలదు. చూచుట కెన్ని సూత్రములులేవు? నా కిన్నియేలా ? నేఁగోరుప్రజాసంరక్షణ కేమియు వెత్తి లేదుగదా ? కావున దైవానుగ్రహమువలన నెల్లప్పుడు.

ఉ. సారమనఃప్రవృత్తిఘనసారపటీరయశస్కులై సదా
చారధురీణతం గడువిశారదులై భువినాల్గువర్ణముల్
పేరిమిఁ గాంచురీతిఁ దమవృత్తులఁ జూచెదఁగాత మెల్లరున్;
భారతవర్ష మెంతయును భారతిభారతిఁ బెంపుఁ గాంచుతన్.

ఎల్లరు—లోకాస్సమస్తా స్సుఖినో భవన్తు.

(ఇ ట్లెల్లరు నిష్క్రమింతురు)

గద్య. ఇది శ్రీబొబ్బిలిపురవాస్తవ్య శ్రీమదాపస్తంబసూ
త్ర పవిత్రగౌతమగోత్ర
బులుసుకులకలశపాథోరాశికైరవమిత్త్రి బుచ్చనపుత్త్రి
చలమాంబాగర్భశుక్తిముక్తాయమాన కవితా
ధురీణ సీతారామకవిప్రణీతం బగు
కృష్ణాకుమారీనామాంకిత మహానా
టకంబునందు సప్తమాంక
ము సర్వంబును
సంపూర్ణము.
ఓమ్.
శ్రీపరమేశ్వరార్పణమస్తు.



# శుద్ధాశుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | వంకజూచి | వంకఁజూచి |
| 4 | 8 | కలద | కలన |
| 4 | 20 | ఉదపుర | ఉదయపుర |
| 6 | 6 | (క్రాశముగా) | (ప్రకాశముగా |
| 19 | 14 | జేవురించి | జేవుఱించి |
| 29 | 24 | బాయని | పాయని |
| ,, | 10 | కెఁగ | కేఁగ |
| 40 | 1 | కూకలు | కూఁకలు |
| ,, | 11 | ఇబు | ఇటు |
| 41 | 13 | చుండెడి | చుండెడిఁ |
| 46 | 2 | మీఱె | మీఱెనది |
| 53 | 5 | అట్టన | ఆట్లన |
| ,, | 6 | జెప్పుచుటివే | జెప్పుచుంటివే |
| 56 | 16 | పూసగ్రుచ్చినట్టు | పూసగ్రుచ్చినట్లు |
| ,, | 18 | లేనట్టే | లేనట్లే |
| 57 | 19 | అయిస | అయిన |
| 58 | 20 | భక్తశివశంకర | భక్తశివంకర |
| 62 | 14 | ఉద్యావనము | ఉద్యానవనము |
| 64 | 13 | నుంటికి | నుండికి |
| 66 | 6 | తవలో | తనలో |
| ,, | 20 | వచ్చినార | వచ్చినారలి |
| 67 | 7 | ఏలనే | ఏటికే |
| 68 | 2 | దైర్యము | ధైర్యము |
| 75 | 10 | కాకేల | నాకేల |
| 82 | 20 | లింగాకిత | లింగాంకిత |
| 73 | 6 | ఎంతదైర్యము | ఎంతధైర్యము |
| 95 | 19 | ఎట్టిఁడు | ఎట్టిఁడుకాని, |
| 96 | 28 | డైననను | డైనను |

## ఆంధ్రగ్రంథములు.

| | ప్రతి 1-కి | రూ. | అ. |
|---|---|---|---|
| ఉత్తరరామాయణము, కంకంటి. పాపరాజప్రణీతము, చక్కనికూర్పు | ... | 1 | 0 |
| డిటో మేలుప్రతి, కాలికోబైండు | ... | 1 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| మొల్లరామాయణము, చిన్నసైజున పెద్దక్షరములతో చక్కగ ముద్రితము | | 0 | 8 |
| అచ్చతెనుగురామాయణము, శుద్ధప్రతి | ... | 1 | 4 |
| ఆంధ్రభాగవతము, పోతనామాత్యప్రణీతము, ఈవఱకుముద్రితమైన ప్రతులకన్న అన్నివిధముల బాగుగనున్నది. | ... | 3 | 0 |
| డిటో మేలుప్రతి, చక్కనిబైండు | ... | 4 | 0 |
| డిటో మేలుప్రతి, 2 వాల్యుములు | ... | 4 | 12 |
| డిటో అత్యుత్తమప్రతి, 2 వాల్యుములు | ... | 5 | 8 |
| వసుచరిత్ర, సవ్యాఖ్యానము, దళసరికాకితములు, చక్కనికూర్పు | ... | 2 | 8 |
| మనుచరిత్ర, సటీక, చిన్నసైజు | ... | 1 | 8 |
| ఆముక్తమాల్యద, సటీక, అట్టబైండు | ... | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము | ... | 0 | 8 |
| కళాపూర్ణోదయము, దళసరికాకితములు | ... | 1 | 8 |
| రాఘవపాండవీయము, సటీక, చక్కనికూర్పు | ... | 1 | 8 |
| శృంగారనైషధము | ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు | ... | 0 | 8 |
| విజయవిలాసము, క్రొత్తకూర్పు | ... | 0 | 4 |
| రంగారాయచరిత్ర, దిట్టకవి. నారాయణకవిప్రణీతము | ... | 0 | 8 |
| ఉత్తరహరివంశము, నాచన, సోమనాథకృతము | ... | 1 | 4 |
| రామాభ్యుదయము, అయ్యలరాజు రామభద్రకవి | ... | 1 | 4 |
| నీలాసుందరీపరిణయము, తిమ్మకవి | ... | 0 | 4 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, చక్కనికూర్పు | ... | 0 | 6 |
| రసికజనమనోభిరామము | ... | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి ప్రణీతము | ... | 0 | 8 |
| రుక్మిణీపరిణయము, కూచిమంచి. తిమ్మకవి | ... | 0 | 6 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవి | ... | 1 | 0 |
| సారంగధరచరిత్ర, చిన్నసైజు, పెద్దచ్చు | ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, అబ్బయామాత్య ప్రణీతము | ... | 0 | 8 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచితిమ్మకవి | ... | 0 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| పంచతంత్రము, నారాయణకవి ... | 0 | 12 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు ... | 1 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు టీకానుక్రమణికా సహితము, కాలికోబైండు ... | 0 | 12 |
| సులక్షణసారము, సటీక ... | 0 | 8 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు, 1200 పద్యములు ... | 0 | 4 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 0 |
| మాతృశతకము ... | 0 | 1 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు ... | 1 | 0 |
| సుమతిశతకము, సటీక ... | 0 | 2 |
| కుచేలోపాఖ్యానము,, (భాగవతములోనిది) ... | 0 | 4 |
| డిటో ,, గట్టుప్రభుకృతము ... | 0 | 6 |
| కుమారీశతకము, సటీక ... | 0 | 2 |
| దాశరథిశతకము ,, ... | 0 | 4 |
| మానసబోధశతకము ,, ... | 0 | 2 |
| భాస్కరశతకము ,, ... | 0 | 3 |
| కలువాయిశతకము, సటీక ... | 0 | 2 |
| కవిచౌడప్పశతకము ... | 0 | 2 |
| నృసింహశతకము ... | 0 | 2 |
| చంద్రశేఖరశతకము ... | 0 | 1 |
| రామలింగేశశతకము, అడిదము. సూరకవి ... | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము, ధూర్జటికవి ... | 0 | 2 |
| భోగినీదండకము, బమ్మెర. పోతరాజప్రణీతము ... | 0 | 1 |
| కుక్కుటేశ్వరశతకము, కూచిమంచి. తిమ్మకవి ... | 0 | 2 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు, మంచికాకితములు ... | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి ,, ... | 0 | 6 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, శ్రీశతఘంటము, వేంకటనరసశాస్త్రి కృతము. ... | 6 | 8 |
| ఆంధ్రవచనవిష్ణుపురాణము, శ్రీతుపాకుల అనంతభూపాలకృతము (అచ్చుపడుచున్నది) | | |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్ర ,, ... | 0 | 2 |
| బాలగంగాధరతిలకుగారిచరిత్ర ... | 0 | 2 |

| | ప్రతి 1-కి రు. | అ. |
|---|---|---|
| దాదాభాయినౌరోజీచరిత్ర, ప్రతిమతో ... | 0 | 1 |
| ఆనిబిసెంటుచరిత్ర, ప్రతిమతో ... | 0 | 1 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, ... | 0 | 2 |
| కన్యాశుల్కము, హాస్యరసభరితముగు నాటకము ... | 0 | 12 |
| ఆనందమఠ, నవల ... | 0 | 12 |
| కపాలకుండల ,, ... | 0 | 12 |
| ఐవన్హో ,, ... | 0 | 6 |
| మదాలస ,, ... | 0 | 10 |
| సుజనరంజని ,, ... | 0 | 6 |
| తారాభాయి, చక్కనినవల ... | 0 | 12 |
| టిప్పుసుల్తాన్, నూతనకవితాశైలి శ్రీఅక్కిరాజు, ఉమాకాంతము గారికృతము | 1 | 4 |
| సీతారామము, శ్రీతల్లాప్రగడ సూర్యనారాయణరావు గారిది ... | 1 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి గారిది, చిన్నసైజు, పెద్దచ్చు ... | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి, పెద్దచ్చు ... | 0 | 6 |
| దక్కనుపూర్వకథలు, కొత్తకూర్పు ... | 1 | 4 |
| రామదాసచరిత్ర, చక్కనికూర్పు ... | 0 | 8 |
| నలచరిత్ర, సటీక, చిన్నసైజు ... | 0 | 6 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు, చక్కనిప్రతి, చిన్నసైజు ... | 0 | 6 |
| బాలవ్యాకరణము ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక, శుద్ధప్రతి ... | 0 | 6 |
| ఆంధ్రభాషాభూషణము ... | 0 | 2 |
| ఆంధ్రభాషార్ణవము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| ఆంధ్రచంద్రాలోకము, సటిప్పణము ... | 0 | 6 |
| శబ్దార్థచంద్రిక, శ్రీమహాకాళి. సుబ్బారాయకృత అకారాదినిఘంటువు... | 2 | 8 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు. ఇందు పూర్వకవుల చరిత్రలే గాక నాధునికకవుల చరిత్రలుకూడ వర్ణింపఁబడినవి, దీనిలో దొరకు కవులచాటు పద్యములు చిత్రకథలు అపూర్వచరిత్రాంశములు మఱియొక దాననెందును గానరావు. కాలికోబైండుకట్టబడ్డ పూర్తిగ్రంథము ... | 2 | 8 |
| విచారసాగరము; శ్రీజనార్దన చైతన్యస్వామి గారిది ... | 5 | 0 |

ఇవి మొదలగు సంస్కృతాంధ్ర గ్రంథములు అనేకములు మావద్దగలవు. క్యాటలాగులు చూడఁగోరినాము.

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

192. ఎస్ప్లనేడ్, చెన్నపురి.

PRINTED AT THE PROGRESSIVE PRESS, MADRAS.

బ్రహ్మశ్రీ, బులుసు సీతారామశాస్త్రులవారు నూతనముగ రచియించిన కృష్ణాకుమారీ నాటకము నవలోకించి కొంతవఱకుఁ జదివితిని. సామాన్య దేశచరిత్రముగ నున్నదై యాస్వాదయోగ్యము గాకయున్న యీ కథను రూపకసంవిధానోచితప్రక్రియానురూపముగా సరి చేసి సుబోధముగను; లలితపదసన్నివేశముచే రమణీయ మగునటులను; వర్ణనప్రస్తావనముల నాతివిస్తృతముగను, నాతిసంక్షిప్తముగను గూర్చిన శాస్త్రిగారి చాతురికిఁ గడుంగడు సంతసిల్లితిని.

ఇట్లు,

వేలాల - సదాశివశాస్త్రి.

3. ఉభయభాషలలో నారితేఱినవారును శ్రీ. శ్రీ. వేంకటగిరి జటప్రోలు బొబ్బిలి మున్నగు సంస్థానాధిపతులచే మిక్కిలి బహూకరింపఁ బడినవారును మదరాసున కలంకారభూతులు నగు బ్రహ్మశ్రీ, చెదలువాడ. సుందరామశాస్త్రులువారీ విధమునఁ దమయాశయము నిచ్చియున్నారు.

బ్రహ్మశ్రీ, బులుసు సీతారామశాస్త్రులవారిచే రచియింపఁబడిన యీ కృష్ణాకుమారీ నాటకము మృదుమధురములైన పదరచనతోడను; మనోహరములైన కల్పనలతోడను మిళితమై సహృదయహృదయ రంజకముగ నున్నదనుటకు నిరాక్షేపము.

ఇట్లు,

చెదలవాడ - సుందరరామశాస్త్రి,

చెన్నపురి.

4. మదరాసు పురవాస్తవ్యులును పచ్చయప్పకాలేజిలోఁ దెనుగు పండితులును నగు శ్రీమాన్ పర్వశాల. నరసింహాచార్యులవారు ఈక్రింది విధమున దమయభిప్రాయమును వెల్లడించుచున్నారు.

ఈ కృష్ణాకుమారియను నాటకము బ్రహ్మశ్రీ, బులుసు సీతారామశాస్త్రులవారు రచించినది. కవితాధార మనర్గళముగఁ బ్రవహిం